# దివ్యప్రబంధ మాధురి

(వ్యాస సంకలనము)

రచయిత:

శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు




ప్రచురణ:

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1994

*DIVYAP*



*by*
*K. T. L. Narasimhacharyulu*

*Edited by:*
*D. Nagasidda Reddi*

*T. T. D Religious Publications Series No.* 442

*Cover Design:*
*Sri P. Narayana Giri Dattu*
*Artist, Editor's Office*
*T. T. Devasthanams, Tirupati.*

*Copies:* 1000

*Published by:*
*Sri D. V. L. N. Murthy,*
*Executive Officer,*
*T. T. Devasthanams, Tirupati.*

*Printed at:*
*T. T. Devasthanams Press,*
*Tirupati*-517 507.

# ముందుమాట

భగవంతుని అర్చావిగ్రహంలోని సౌందర్య స్వారస్యాన్ని ఆస్వాదించిన మహాత్ములు ఆళ్వార్లు. వీరు 12 మంది. ద్వాదశసూరులు, దివ్యసూరులు అనికూడ వీరు వ్యవహరింపబడుతున్నారు. అప్రాకృతమైన పరమేశ్వరుని దివ్యసౌందర్యాన్ని దర్శించడంలో తమకు కలిగిన అనుభూతినీ, ఆనందాన్ని ఇతరులకు సంక్రమింపజేయడం ఈ మహాత్ముల ప్రధాన లక్ష్యం. పరమాత్ముని అనుగ్రహాన్ని పొందటానికి శీలం, అంతరంగ శుద్ధి తప్పనిసరి అని వీరి అభిప్రాయం. ఆళ్వారుల భగవద్దర్శనములోని అనుభవం పాశురాల రూపంలో 'నాలాయిరం' (4 వేల పద్యాలు) అనే పేరుతో వెలువడి ద్రావిడప్రబంధం, దివ్యప్రబంధం అని ప్రఖ్యాతి పొందింది. వైష్ణవుల కిది వేదంలాంటిది.

ఆళ్వారులలో సుప్రసిద్ధుడు నమ్మాళ్వార్. తామ్రపర్ణినదీ తీరంలోని కురుకాపురం ఈయన జన్మస్థానం. కారి, ఉడయనంగై అనే పుణ్యదంపతులీ మహనీయుని తల్లిదండ్రులు. ఆళ్వారులలో నమ్మాళ్వారు శరీరి యనీ, ఇతరులు ఆయనకు కరచరణాద్యంగప్రాయులనీ ప్రతీతి. భగవంతుడు స్వయంగా తన మెడలోని వకుళమాలను ఈ భక్తాగ్రేసరుడికి కానుకగా సమర్పించడంవల్ల వకుళభూషణ నాయకి అనే పేరీయనకు సిద్ధించింది. శఠకోప యతీంద్రులని కూడా వీరు వ్యవహరింపబడుతున్నారు.

నమ్మాళ్వారు రచించిన తిరువాయ్‌మొళి తమిళవేదమని ప్రసిద్ధి వహించింది. పరతత్త్వ ప్రతిపాదితశాస్త్రాల్లో వేదం ఎలాంటిదో ఈ గ్రంథంకూడ భగవద్విషయబోధకాలైన ద్రావిడగ్రంథాల్లో అలాంటిదని విజ్ఞుల అభిప్రాయం. నాలాయిరంలో ఈయన రచించిన పాశురాలు వేయి. దీనికి సహస్రగీతి అని పేరు. ద్రావిడవేదంలో దీనికి శీర్షస్థానం లభించిందనీ, చతుర్వేదాల సారాన్నిది ప్రతిపాదించిందనీ వైష్ణవాచార్యుల విశ్వాసం.

దివ్యప్రబంధంలోని పాశురాలు భక్తిరస పరిపూర్ణాలు. వీటిలోని కవితామాధుర్యం భక్తకోటిని పరవశింపజేస్తుంది. శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యుల వారు పాశురాల్లోని తియ్యదనాన్ని 'దివ్యప్రబంధ మాధురి' అనే పేరుతో వ్యాస సంపుటి రూపంలో ఆంధ్రప్రజలకు రుచి చూపించారు. అశేషభక్తజనావళికి అందుబాటులో వుండాలనే ధ్యేయంతో తిరుమల తిరుపతి దేవస్థానములు దీన్ని ముద్రించింది. చదువరులకు ఇది ప్రయోజనకారి కాగలదని మా నమ్మకం

తిరుపతి,
జూన్ 28, 1934

డి. వి. ఎల్. ఎన్. మూర్తి
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# సూ చి క

శ్రీమతే రామానుజాయనమః

ఒకటి

# దివ్య ప్రబంధ మాధురి

"దేశభాషలందు తెలుగు లెస్స" అన్న కృష్ణదేవరాయల నానుడి శిరోధార్యం అయినట్లే - ఎవరి భాష వారికి సమ్మాన్యం అనే విషయాన్ని - మన ఆంధ్రభాష ఆదికవి నన్నయ్య కంఠోక్తిగా చాటిన ఈ సంస్కృత సూక్తి కూడా సర్వులకూ శిరోధార్యమే.

శ్లో॥ "స్వస్థాన వేషభాషాభిమతా స్సంతో రసప్రవలుబ్ధధియః;
లోకే బహుమన్యంతే ప్రైకృతకావ్యాని చాన్యదపహాయః."

కాని ఇరుగు పొరుగు దేశాలవారిని గూడా గౌరవించటం, వారి మంచి తెలిసికోవటం, వారి నుండి మంచి నేర్చుకోవటం, వారికి మంచి చేయటం - మంచివారు చేయదగిన మంచి పనులు. ఈ దృష్టితో మన ఇరుగు పొరుగు భాష అయిన తమిళంలోని మంచిని కొంత తెలుసుకొందాం.

'అరవం' 'రవం' అనే సంస్కృత శబ్దానికి దగ్గరిది. 'రంగం' అనే పదాన్ని 'అరంగం' అని పలికినట్లే అరవవారు 'రవం' 'అరవం' గా మార్చుకొన్నారు. రవం అంటే ధ్వని, కాని ఆ భాషలో అరవం అంటే మధురధ్వని అని అర్థం.

ఒక్క అరవానికే కాదు - దక్షిణాది భాషలైన మన తమిళ తెలుగు మలయాళ కన్నడ భాష అన్నిటికీ కలిపి ద్రావిడ భాషలని పేరున్నది గదా! తమిళమన్నా అరవమన్నా ఒకటే. తమిళ్Z అనే అరవ పదానికి సంస్కృతీకరణం ద్రవిడ అనే పదం. ద్రవిడానికి సంబంధించింది ద్రావిడం. ద్రావిడభాషా సంప్రదాయాన్ని సూక్ష్మంగా పరిశీలించిన వారికి ఈ నాల్గింటికీ మూలభాష ఒకటే అని అవగతం అవుతుంది.

---

"తమిళ భాషామాధుర్యం" అనే పేరుతో 2-9-79 న విజయవాడ ఆకాశవాణి నుండి చేసిన ప్రసంగము - వారికి కృతజ్ఞతతో.

సరే, ప్రస్తుత విషయానికి వద్దాం. దక్షిణాది భాషల్లో అరవం బహు ప్రాచీనం. దానిలో సాహిత్యం కూడా మన తెలుగుభాషకు ముందే వెలసి వెల్లి విరిసింది. తమిళభాష పేరెత్తే సరికి కంబరామాయణం అక్షరాస్యుడైన ప్రతివానికీ స్ఫురించితీరుతుంది. హిందీలో తులసీరామాయణానికి గల ప్రసిద్ధి అరవంలో దీనికి కూడా ఉంది. మన సుమతీశతకానికి ఉన్న ప్రాముఖ్యం ఆ భాషలో 'అవ్వయార్' వ్రాసిన అమూల్యకృతి "అత్తిచ్చూడి" అనే గ్రంథానికి ఉంది. 'తిరువళ్ళువర్' అనే మహాకవి వ్రాసిన "తిరుక్కురళ్" కూడా ప్రసిద్ధ నీతికావ్యమే. ఆ భాషలో "తొల్కాప్పియం" "శిలప్పదికారం" "మణిమేకలై" అద్వితీయ రసవత్కావ్యాలు.

కాని భక్తి కావ్యాలు నిర్మితమైన కాలమే ఈ భాషకు స్వర్ణయుగం. శైవభక్తి, వైష్ణవభక్తి అని ఈ భక్తికి రెండు శాఖలు. శివభక్తిని ప్రతిపాదించే గ్రంథాలకు "ఎట్టాయిరం" అని పేరు. అంటే ఎనిమిదివేల పద్యాలు గల కావ్యాల సమూహం. ఈ సాహిత్యం నిర్మించిన కవులు అరవై ముగ్గురు. వీరిని నాయన్మారు అంటారు. వీరిలో 'మాణిక్కవాశకర్' అనే మహాకవి రచించిన "తిరువాశకం" కొన్ని కావ్యాల సంపుటి. "తిరుప్పళ్ళియెళుచ్చి", "తిరువెంబావై" అనే గ్రంథాలు ఈ సంపుటిలోవే. పరమేశ్వరుని మేల్కొలుపూ, స్తుతీ ఈ రెండు కావ్యాలకూ విషయాలు.

ఇక విష్ణుభక్తి. ఈ భక్తి భాగీరథిని ప్రవహింపచేసినవారు ఆళ్వారులు. వీరు పన్నిద్దరు. ఈ ప్రసంగంలో ప్రధానంగా వీరిని గురించే ముచ్చటిస్తాను.

రాయలు వీరిని ఆముక్తమాల్యదలో ఇట్లా ప్రస్తుతించారు :—

మ. "అల పన్నిద్దరు సూరులందును సముద్యల్లీలగావున్న బె
గ్గలికం దావము భావ నా నిజమనఃకంజాత సంజాత పు
ష్కల మాధ్వీక ఝురిన్ మురారి సొగియంగా జొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దరు సూరులం దలతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్"

అంధకారం పోగొట్టి లోకానికి వెలుగిచ్చే వాడవటంచేతనే సూర్యుణ్ణి లోకబాంధవుడనీ, సూర్యనారాయణుడనీ అంటారు. కాని ఆ సూర్యభగవానుని వేడిమికూడా మితిమీరితే దుర్భరమే అవుతుందిగదా మరి! ఆ తాప తీవ్రత తగ్గించి మానవుల హృదయాల్లోని అజ్ఞానాంధకారం దూరంచేసి జ్ఞానదీపం వెలిగించటానికే భూమిమీద ఈ ద్వాదశ దివ్యసూరు అవతరించారు. కనుక, వీరు సూర్యులతో సమానులే కాదు — ఈ విషయంలో అతనిని మించినవారు కూడా!

ఈ ఆళ్వారు లందరూ దేశకాలరీత్యా విభిన్నులయినా, భగవదేకాత్మ్య అవటం చిత్రాతిచిత్రం. పద్మాలు సూత్రబద్ధమై ఎలా ధారణ యోగ్య మవుతవో అలాగే ఈ దివ్యసూరుల మధుర భక్తిసుమాలు కూడా భక్తిసూత్ర గ్రథితాలై సహృదయుల కంఠధారణ యోగ్యతకు నోచుకొన్నవి. ఇవి సామాన్య సూక్తులు కావు - మరి దివ్యప్రేమ సురభిళ కల్పతరు ప్రసూనాలే!

ఈ భక్తి సరస్వతీ ప్రవాహం దక్షిణ భారతదేశంలో ద్రావిడకవుల వాణినుండి సహజాతిసహజంగా మృదుమధురంగా సులభసుందరంగా వెలువడి :

ద్విపద. "అరవిందభవ సపర్యాప్త గోవింద
చరణారవిందనిష్యంద మరంద
వారిధారాకార వరవారిపూర
పూరితగంభీరభూరినిర్ఘోష
రంగదభంగసంభ్రమ భరోత్తుంగ
గంగాతరంగవైఖరులు దీపింప"

అని అన్నమాచార్యులు పాకొన్నట్లు - అయత్నంగా ఉత్తరదిశకు ప్రవహిస్తూ దుర్గమ పర్వతాలను సైతం ఆరోహించి ఆ దిశ కవధి అయిన పరమపదంలో విరాజిల్లే పరతత్త్వం శ్రీమన్నారాయణునిలో ఐక్యం అవుతుంది.

ఆలకించండి ఈ శ్లోకం :-

"ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి."

ఆకసం నుంచి వర్షించిన జలం సముద్రంలో పడినట్లే, ఏ దేవునికి నమస్కరించినా అది కేశవునికే చెందుతుంది.

ఆళ్వారుల నందరినీ సంగ్రహించి పలికే శ్లోకం ఇది :-

"భూతం సరస్య మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్;
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్."

1. పొయ్‌గయాళ్వార్ 2. పూదత్తాళ్వార్ 3. పేయాళ్వార్ 4. పెరియాళ్వార్ 5. తిరుమళిశయాళ్వార్ 6. కులశేఖరాళ్వార్ 7. తిరుప్పాణాళ్వార్ 8. తొండరడిప్పొడియాళ్వార్ 9. తిరుమంగయాళ్వార్ 10. మధురకవియాళ్వార్ 11. ఆండాళ్ 12. నమ్మాళ్వార్. శ్రీవైష్ణవసంప్రదాయానికి ప్రవర్తకులైన 'ఉడయవర్', 'ఎంబెరుమానార్' అనే నామాంతరాలు గల భగవద్రామానుజాచార్యుల వారిని కొంతమంది మధురకవికి మారుగా చేరుస్తారు ఈ పన్నిద్దరిలో.

భగవద్గుణానుభవం అనర్గళంగా వీరి వాక్కులనుంచి వెలువడింది. విష్ణుభక్తి అనే అగాధ నదిలో మునిచి ఉక్కిరిబిక్కిరి చేసి మానవుల్ని కాపాడేవారయినందున వీరికి ఆళ్వార్ అనే ఈ బిరుదు సార్థకం అయింది. కవితాసుందరి తనకు తానుగా వలచివచ్చి తమ వాక్కుల్ని వరించిన కారణంగా తమ పాశురకవితలతో మనల్ని రక్షించటానికే అవతరించారు వీరు.

వీరు పాడిన పాటలన్నీ మొత్తం నాలుగు వేలు. కనుకనే దీనికి "నాలాయిరం" అనే పేరు రూఢం అయింది. విష్ణుభక్తిని ప్రతిపాదించే ఈ కావ్యసంతతికి "దివ్యప్రబంధం" అని కూడా పేరుంది. ఈ శాఖలో మొత్తం ఇరవైనాలుగు ప్రబంధా లున్నవి.

శ్రావ్య సంగీతమాధురిగల పద్యమే పాశురం. నాథముని అనే కవినాథు లొకరు ఈ ద్రావిడవేదానికి రాగతాళాలు కూడా నిబంధించి విరివిగా ప్రచారం కల్గించారు.

ఈ దివ్యప్రబంధం అంతటికీ మకుటాయమానం నమ్మాళ్వారుల తిరువాయ్‌మొళి. భగవత్కటాక్షజన్య వాగ్ధోరణి అని దీని కర్థం. ఈ కవికే శఠకోపమహర్షి అని ఇంకోపేరు. వీరు శ్రీ మహావిష్ణువుకు పాద స్థానీయులు. ఈ మహాకవి మూర్తీభవించిన కరుణరసం. చెడుదారుల్లో కన్నుగానక పయనిస్తూ నరకకూపంలో పడిపోతూ ఉండే బద్ధజీవుల్ని ఉద్ధరించటానికే వీ రవతరించారు.

ఇక కాలహరణం చేయకుండా ఈ ఆళ్వారుల దివ్యప్రబంధ మాధురిని స్థాలీపులాకన్యాయంగా ఆస్వాదిద్దాం.

వీరిలో మొట్టమొదట అవతరించిన పొయ్‌గ పూదత్త ప్పేయాళ్వారులు అనే యోగిత్రయం ఒక పెను తుపానులో ఒక ఇంటి అరుగుమీద కలిసికొన్నారు. ఆ రాత్రివూట - కన్ను పొడుచుకున్నా కానరాని ఆ కటిక చీకటిలో - ఈ ముగ్గురూ భగవద్గుణానుభవామృతపానమత్తచిత్తులై మైమరచి ఉన్నారు. వారి భక్తి ప్రకర్షకు పరవశించిపోయి శ్రీ మహావిష్ణువు ఉన్నట్లుండి అదృశ్యరూపంతోవచ్చి వారినడుమ నిలిచి చిందులు వేయసాగాడు. అపుడు పొయ్‌గయాళ్వారులు ఆ మహామూర్తిని గుర్తించటానికి ఒక దివ్యదీపం తెచ్చారు. ఆ దీపకళిక ఇది :-

పా. " వైయం తకళియా వార్ కడలే నెయ్యాక
వెయ్యకతిరోన్ విళక్కాక - శెయ్య
శుడరాళి యా నడిక్కే శూట్టినేన్ శొన్మాలై
ఇడరాళి నీంగుక వే యెంగు."

భూమిని ప్రమిదగాచేసి, దానిలో సముద్రజలం అనే నెయ్యిపోసి, ఉష్ణకిరణాలతో వెలిగే సూర్యుణ్ణి వత్తిగా వేసిన దీపంతో స్వామి నర్చిస్తానన్నా రీ కవి.

తరువాత పూదత్తాళ్వారులు తమ హృదయంలోనే ప్రజ్వలిస్తూ ఉన్న జ్ఞానదీపంతో ఆ శ్రీపతి కిట్లా నివాళి పట్టారు :—

పా. " అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక
ఇన్బురుకుశిందై ఇడుతిరియా - నన్బురుకి
జ్ఞానచ్చుడర్విళ క్కేత్తినేన్ నారణర్కు
జ్ఞానత్తమిళ్ పునిందనాన్."

భక్తిని ప్రమిదగా చేసి ఆర్తిని నెయ్యిగా దానిలోపోసి, భగవత్సం దర్శన జనితానందం అందులో వత్తిగావేసి, అజ్ఞానాంధకారం దూరం అయ్యేట్లుగా పరభక్తి అనే ఉజ్జ్వల దీపాన్ని నిండుమనస్సుతో అర్పించి ఆ శ్రీహరిని అర్చిస్తున్నాము అని దీని అర్థం.

ఈ ఇద్దరు భక్తులూ వెలిగించిన జ్ఞానదీపం ఆధారంగా పేయా ళ్వారులు ఆభగవానుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యం కన్నుల కరువు తీరా సందర్శించారు. ఆ శుభక్షణంలో అయత్నంగా వెలువడిన సుమధుర వాణియే ఇది :—

పా. " తిరుక్కండేన్ పొన్మేనికండేన్ తికళుమ్
అరక్కన్ అణినిరముంకండేన్
పొన్నాళి కండేన్ పురిశంగం కైక్కండేన్
ఎన్నాళి వణ్ణన్ పాల్ ఇంగు "

అహో! శ్రీమహాలక్ష్మితోపాటు శ్రీహరి సువర్ణ శరీరసౌందర్యం ప్రత్యక్షమైంది నా కిప్పుడు. పాపాత్ముల్ని ఛేదించే సుదర్శనాయుధం కూడా స్వామి చేతిలో ఉంది. అంతేకాదు - ప్రళయకాలాభీల పర్జన్యగర్జ ననుకరించే పాంచజన్యాన్ని సైతం కాంచగల్గిన సుకృతిని కాగలిగినాను. ఇట్టి నా కింకేమి కావాలి !

పెరియాళ్వారుల ఈ పాశురం ద్రావిడ వేదానికి ఓంకారమే :—

పా. "పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు
పలకోడి నూరాయిరం,
మల్లాండ తిండోళ్ మణివణ్ణా
ఉన్‌శేవడి శెవ్వి తిరుక్కాప్పు."

మహాబలవంతులైన చాణూరాది మల్లుల్ని నల్లులవలె నలిపివేసిన స్వామీ, నీ శ్రీచరణాలకు అనేక వేల లక్షల కోట్ల సంవత్సరాలు మంగళం!

విష్ణుచిత్తుడనే మరో పేరుగల ఈ ఆళ్వారుల ఆతిథ్య వైశిష్ట్యాన్ని ఉగ్గడించే రాయల ఈ పద్యం ఆంధ్ర సాహిత్యరత్నాకరంలో ఉదయించిన ఉజ్జ్వల నీలమణి.—

శా॥ "ఆ నిష్ఠానిధి గేహసీమ నడురే యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్రశయానుు పుణ్యకథలున్ దివ్య ప్రబంధాను సం
ధాన ధ్వానము 'నాస్తిశాక బహుతా' 'నాస్త్యుష్ణతా' 'నాస్త్యపూ
పో' 'నా స్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య'మన్ పల్కులున్."

— ఆముక్తమాల్యద

పది పాశురాలు మాత్రంగల కావ్యం వ్రాసి తిరుప్పాణాళ్వారులు ఉత్తమకవిగా వాసికెక్కారు. వారి పాశురం:—

పా॥ "అలమామరత్తినిలై మేలొరు పాలకనాయ్
ఞాలమేళుzముండాన్ అరంగత్తరవి నణైయాన్,
కోలమామణియారముం ముత్తుత్తామముం ముడివిల్ల తోరెళిzల్
నీలమేనియయ్యో నిరై కొండ తెన్నెంజమే."

మహాప్రళయంలో జగత్తంతా తన చిరుబొజ్జలో ఉంచుకొని చిన్ని మఱ్ఱిఆకుమీద పసిబిడ్డడై పరుండియున్న శ్రీమహావిష్ణువే శ్రీరంగములో ఆదిశేషునిమీద శయనించి ఉన్నాడు. ఆ స్వామి దాల్చిన రమ్యమైన రత్నహారమూ, ముత్యాలపేరూ, వాని నీలవర్ణ శరీరమూ నా హృదయ గాంభీర్యాన్ని రూపుమాపినవి.

మిగిలిన ఆళ్వారులందరూ శరీరం; నమ్మాళ్వారులు శరీరి. వీరి పాశురం మచ్చుకు:-

పా॥ పొలిక పొలిక పొలిక పోయిత్తు వల్లుయిర్ చాపం
నలియుం నరకముం నైన్దు నమనుక్కింగు యాతొన్నుమిల్లై;
కలియుం కెడుం కండు కొణ్మిన్ కడల్వణ్ణన్ పూతంగళ్ మణ్ మేల్
మలియప్పుకుందిశై పాడియాడి యుళితర క్కండోమ్."

భాగవతోత్తములలోనే భగవంతుడున్నాడు. అతని అస్తిత్వం వేరే లేదు. శ్రీహరికి చరస్వరూపులైన అట్టి భక్తుల్ని కాంచగానే మన పాప పటలి పటాపంచలైపోయింది. కలిదోషాలు హరించినవి. ఇక యముని క్రూర కార్యకలాపాలు మూలపడిపోయినట్లే. ఎటుచూచినా హరిభక్తి సామ్రాజ్యమే సమృద్ధిగా ప్రత్యక్షమవుతుంది.

తన భక్తి కవితామృతధారతో యావద్భారతాన్ని ఓలలూగించిన అమేయ భగవత్కామావిష్ట మహాకవయిత్రి ఆండాళ్ తల్లియొక్క పాశురంతో ఈ ప్రసంగానికి మంగళగీతిక ఆలాపిద్దాం. ఇది ఆమె వ్రాసిన అద్వితీయ రసకావ్యం తిరుప్పావులోది:-

పా॥ "శిత్తం శిరుకాలే వందున్నై చ్చేవిత్తు-ఉన్
పొత్తామరై యడియే పోత్తుం పొరుళ్ కేళాయ్,
పెత్తంమేయ్త్తుణ్ణుం కులత్తిల్ పిఱన్దు నీ
కుత్తేవల్ ఎంగళై క్కొళ్ళామల్ పోకాదు
ఇత్తై ప్పరై కొళ్వానన్ఱుకాణ్ - కోవిన్దా
ఎత్తైక్కుమేళ్ ఏళ్ పిఱవి క్కుం ఉన్దన్నో
డుత్తోమే యావోమ్ ఉనక్కే నామాట్చెయ్వోమ్
మత్తైనమ్ కామఙ్గళ్ మాత్తేలో రెమ్బావాయ్."

తెలతెలవారుతూ ఉండగా నీ పాదపద్మాలు సేవించటానికి వచ్చాము. గోవులమేకాచే కులంలో పుట్టినా మాకు నీ అంతరంగ కైంకర్యం

అనుగ్రహించక తప్పదు సుమా! ఏడేడు జన్మల్లోనూ నీతోనే మేము కలిసి ఉంటాము. నీకు మాత్రమే సేవ చేస్తాము. ఈ ఒక్కదాన్ని తప్ప మిగిలిన మా కోరికలన్నీ ముట్టుపెట్టుమా గోవిందా!



రెండు

# ఆళ్వారులు – నాలాయిర దివ్యప్రబంధము

శ్లో॥ శ్రీరంగార్య కృపాపాత్రం రామానుజ పదాశ్రయమ్,
శ్రీనృసింహార్య సత్పుత్రం జగన్నాథగురుం భజే.

శ్లో॥ "నిత్యానవద్యమధురైః ద్రవిడప్రబంధైః
వేదాన్ వివర్తితవతా మవతీర్యలోకే,
అవిద్య మన్ధతమసం పరిహర్తు మారాత్
తాన్ దివ్యసూరితిలకా ననిశం భజామః.

శ్రీసూర్యనారాయణుడు తన యప్రతిమ ప్రకాశముచే నంధకారము బోగొట్టుటచేతనే లోకవ్యవహారములు నిర్విఘ్నముగా సాగుచున్నవి. అట్టి సూర్యులు పన్నిద్దఱు. ద్వాదశసూర్యుల యీ తాపతీవ్రత తగ్గించుటకై ఇలపై నీ ద్వాదశసూరు లవతరించినారు. వారే పన్నిద్దరాళ్వారులు తమ హృదయపంకజములనుండి నిసర్గసుందరముగా వెలువడిన మధుర మధుప్రవాహముచే మురారిని సొక్కించి ధన్యాత్ములైన పరమ భాగవతోత్తములు.

భగవంతుని గూర్చిన ప్రేమయే భక్తి. తైలధారవలె నవిచ్ఛిన్నముగా ప్రవహించు భావధారయే భక్తి! దేవునియెడ ననన్యప్రేమయే భక్తి!! శ్రియఃపతి కల్యాణగుణ చేష్టితములను తద్దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును హృదయదఘ్నముగా అతృప్తామృతమునువలె ననుభవించుటయే భక్తి!!! త్రివిధతాప పరితప్తులగు జీవులకా భక్తియొక్కటే దివ్యశాంతి కల్గించు రసాయనము. భక్తియను భావమునకు రసపరిపాక యోగ్యత కల్గించినవా రీ యాళ్వారులే.

ఈ భక్తినది దక్షిణభారతమున ద్రావిడకవుల వాణినుండి సహజసుందరముగా వెలువడి అవ్యయత్నముగనే ఉత్తరదిశకు పయనించి పరమపదమున విరాజిల్లు పరతత్త్వము శ్రీమన్నారాయణునం దైక్యమగును.

అనాదియైన శ్రీవైష్ణవ సంప్రదాయమునకు - దీనినే శ్రీభాగవత సంప్రదాయమని గూడ నందురు. మూలపురుషులగు వారు పైన పేర్కొనిన యాళ్వారులే. ముముక్షువు - మోక్షార్థియైనవాడు - అందుమ విష్ణుభక్తుడు-ఈ యాళ్వారులను గూర్చి వీరి భక్తితత్త్వమును గూర్చితెలిసికొని తీరవలెను. ఆలకింపు డీ శ్లోకము :-

"భూతం సరస్య మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్."

పై శ్లోకమున పదునొకండుగురు ఆళ్వారుల పేర్లు గలవు. 1. పొయ్‌గయాళ్వార్, 2. పూదత్తాళ్వార్, 3. పేయాళ్వార్, 4. పెరియాళ్వార్, 5. తిరుమళిశయాళ్వార్, 6. కులశేఖరాళ్వార్, 7. తిరుప్పాణాళ్వార్, 8. తొండరడిప్పొడియాళ్వార్, 9. తిరుమంగయాళ్వార్, 10. ఉడయవర్, 11. నమ్మాళ్వార్. వీరికి సంస్కృత నామాంతరము లివి. 1. సరోయోగి, 2. భూతయోగి, 3. మహాయోగి, 4. భట్టనాథులు, 5. భక్తిసారులు, 6. కులశేఖరులు, 7. మునివాహనులు, 8. భక్తాంఘ్రిరేణువు, 9. పరకాలయోగి, 10. శ్రీమద్రామానుజులు, 11. శఠకోపముని. వీరిలో ఉడయవర్లను తగ్గింపగా మిగిలినవారికి పదుగురాళ్వారులు అని గూడ వ్యవహారము గలదు. పై శ్లోకమం దీ పదకొండుగురకును ఆండాళ్ అను గోదాదేవిని కూడ కలిపిన పన్నిద్దరాళ్వారు లగుదురు. వీరే ద్వాదశ దివ్యసూరులు. ఇందలి శ్రీభక్తిసార అను పదములో 'శ్రీ'ని విడదీసి గోదాదేవి యని యర్థము చెప్పుదురు కొందరు. 'మిశ్ర' అనుటచే మధురకవి సూచితులు అందురు మరికొందరు.

భగవద్గుణానుభవము నిరర్గళముగా స్వర్గంగవలె వీరి వాక్కులనుండి ద్రావిడ భాషారూపమున వెలువడినందున వీరికి ఆళ్వారులు అను పేరు కల్గినది. ఆళ్వారు అనిన కాపాడువాడు అని వ్యుత్పత్తి. కవితాసుందరి వలచి వచ్చి వీరి వాక్కులను వరించినది. కావుననే తమ పాశుర కవితలతో వీరు మనలను కాపాడుటకు పూనుకొనినారు. అందుచే వీరి కి

నామము సర్వథా సార్థకము. భగవదనుభవ పరీవాహ రూపమయి భక్తిసాగరమున మునకలువైచి యుండలి లోతులను కనుగొన్న వార కావున ఆళ్వారను మాట కర్థము చెప్పవచ్చును. తమపై నాస్థ కలిగి యున్నజీవులను తమతోబాటు భక్తిరసామృత సింధువున ముంచి యుక్కి బిక్కిరి చేసి బ్రహ్మానందమున దేల్చుట యీ ద్వాదశసూరులకు వెన్నతో బెట్టిన విద్య.

శ్లో॥ "జన్మకర్మచ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున!"

"అర్జునా! దివ్యమైన నా జన్మకర్మల తత్త్వమెరిగిన జ్ఞానికి పునర్జన్మము లేదు. అట్టివాడు నన్నుతప్పక చేరుకొనును" అని శ్రీకృష్ణ భగవాను డర్జునునితో పలికినది మహాజ్ఞానులగు వీరిని గురించియే.

శ్రీవైష్ణవధర్మమును శ్రీమహావిష్ణువు శ్రీదేవి కుపదేశింపగా నామె వానినే విష్వక్సేనునకు చెప్పెను. ఈ విధముగా నిది గురుపరంపరాను గతమై నా భగవద్రామానుజులకు సంక్రమించి వారివలన చతుస్సప్తతి సింహాసనాధిపతులను నాచార్యులద్వారా యీ లోకమున వ్యాపించెను.

భగవంతునకు భాగవతులకును నడుమగల సంబంధమును విశద పరచునది గాన భాగవతసంప్రదాయమనియు, శ్రీదేవిద్వారా వ్యాపించినది గాన శ్రీసంప్రదాయ మనియు దీనికి నామాంతరములు. రామానుజులు దీనిని విశాలవిశ్వమున విరివిగా వ్యాపింపజేసినందులకు రామానుజ సంప్రదాయమని గూడ దీని నందురు.

కాని యీ సంప్రదాయమునకు మూల మాళ్వారులసూక్తులే యనుట నుడువరాదు. వీరిలోగూడ నమ్మాళ్వారులు శరీరియని ప్రాణ మని ఇతరులు వారికి కర చరణాద్యంగ ప్రాయులని ప్రతీతి!

ఈ యాళ్వారుల శ్రీముఖములనుండి వెలువడిన జ్ఞానగంగా ప్రవాహమే ద్రావిడవేదము. ఇది చతుస్సహస్రగాథా పరిమితము. ఇందులో నాల్గువేల పాశురములు (పద్యములు) ఉండును. కాన దీనికి నాలాయిర మని ద్రావిడ నామము. సుమారు నాల్గువే లుండునని మాత్రమే యర్థము.

ఆ గంగవంటిదే ఈ జ్ఞానగంగ. ఇది ఉన్నత ధారుణీధ్ర శిఖరోత్పద చ్ఛపయస్వినీఝరిసన్నిభము గలగల ప్రవహించు నమిత వేగముగల గంగానదిని బోలినట్టిది. ఆళ్వారులది భగవత్కటాక్షజన్య వాగ్ధోరణి. కాననే యందు నిర్మలభక్తిరసమే యన్ని రసములకంటె నుజ్జ్వల నీలమణియై వింతవెలుగు లీనుచుండును. పాపమాలిన్యము దూరముచేసి ప్రాణికోటిని తరింపజేయుటయే వీరి కవితకు చరమలక్ష్యము.

దైవీశక్తియుక్తులగు నాళ్వారులు సృష్టించినదగుటచే నీ గ్రంథ సమూహమునకు దివ్యప్రబంధమని పేరు వచ్చినది. ఈ నాలాయిర దివ్య ప్రబంధమున "ముదలాయిర" మనబడు ప్రథమ సహస్రమున వేయి పాశురము లుండును. పెరియాళ్వార్ రచించిన "పెరియాళ్వార్ తిరుమొళి" మొదటి సగపాలాక్రమించుకొన్నది. తర్వాత నాయన సుపుత్రిక యాండాళ్ అని పిలువబడు గోదాదేవి రచనలు 2. నాయ్చ్చియార్ తిరుమొళి 3. తిరుప్పావు అనునవి గలవు. అనంతరము కులశేఖరుల 4. పెరుమాళ్ తిరుమొళి, ఆటుతర్వాత తొండరడిప్పొడి యాళ్వారుల 5. తిరుప్పళ్ళి యెళుచ్చి 6. తిరుమాల గణనకు వచ్చును. తదుపరి తిరుప్పాణాళ్వారుల 7. అమలనాది పిరాన్, మధురకవి యాళ్వారుల 8. కణ్ణినుణ్ శిరుత్తాంబు కలవు. కణ్ణినుణ్ శిరుత్తాంబు భగవంతునికంటె భగవంతుని చూపిన గురువే గొప్పవాడని వివరించి యాచార్య ప్రతిపత్తిని నిరూపించును. చివరి రెండు గ్రంథములందును సుమారు పదేసి పద్యములు మాత్రమే గలవు. ముదలాయిరమున చిట్టచివరన కూర్చబడిన 9. తిరుచ్ఛంద విరుత్తమ్ అను గ్రంథమునకు రచయిత తిరుమళిశ యాళ్వారులు.

ద్వితీయ సహస్రమునకు "ఇయఱ్పా" అని పేరు. ఇందు ముదల్ తిరువన్దాది, ఇరణ్డామ్ తిరువన్దాది, మూన్ఱామ్ తిరువన్దాది, నాన్ముకన్ తిరువన్దాది, తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువన్దాది, పెరియ తిరుమడల్, శిరియ తిరుమడల్, తిరువెళుక్కూత్తిరుక్కై యను పది గ్రంథములు గలవు. మొదటి నాల్గును వరుసగా పొయ్గ యాళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశయాళ్వారు రచించినవి. తిరువిత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువన్దాది నమ్మాళ్వారు రచించిరి. చివరి మూడును తిరుమంగై యాళ్వారు రచించినవి.

తృతీయ సహస్రమున పెరియ తిరుమొళి, తిరుక్కురుందాండకమ్, తిరునెడుందాండకమ్ గలవు. ఈ మూడింటికిని గూడ తిరుమంగయాళ్వారే కర్త.

నాల్గవ సహస్రము సహస్రగీతి యనబడు తిరువాయ్మొళి. దీని కర్త ప్రత్యేకించి నమ్మాళ్వారులే.

శఠకోపు లనబడు నమ్మాళ్వారులు శఠిరి యని చెప్పబడినట్లే వారి సూక్తియగు తిరువాయిమొళి గూడ నీ ద్రావిడ వేదమున శీర్షస్థానీయము కాననే దానికి చరమ ప్రబంధమని ప్రసిద్ధి. వీరు తమ నాల్గు గ్రంథము లందును ఋగ్యజుస్సామాథర్వ వేదముల సారమును ప్రతిపాదించిరని శ్రీవైష్ణవాచార్యుల విశ్వాసము.

ఈ నాల్గు ప్రబంధముల యర్థము వివరించుటకై తిరుమంగయాళ్వారుల వేదాంగములను బోలిన గ్రంథముల నారింటిని రచించిరి. వీరు చతుష్కవిశిఖామణిగా ప్రసిద్ధులు. ఆశు మధుర చిత్ర విస్తారకవితలే చతుష్కవితారీతులు. వీరి పెరియతిరుమొళి భగవత్కావ్యములలో మిగుల ప్రౌఢము, రసవంతము. నాలాయిరమున సంఖ్యలో వీరికృతులే యధికము.

ఈ ద్రావిడ వేదమునకు పరిశిష్టముగా "తిరువరంగత్తముదనార్" అని కవి రచించిన "ఇరామానుశనూత్తందాది" చేర్చబడినది. దీనికి ప్రసన్న గాయత్రి యని నామాంతరము. ఇది ఇయుఱ్పాలో చేర్చబడినది. ఈ విధముగా నాలాయిరమున ఇరువది నాలుగు వేర్వేరు ప్రబంధములు గలవు

ఆళ్వారుల పాశురములు కొన్నిటినైనను ఉదాహరించి వాని భావమును వివరించిననే ఈ వ్యాసలక్ష్యము నెరవేరును. కాని విస్తర భీతిచే నమ్మాళ్వారుల ఒక పాశురమును మాత్రమే ఉదాహరింతును.

పా॥ పొలిక పొలిక పొలిక పోయిత్తు వలుయిర్ చాపమ్
నలియుమ్ నరకముమ్నైన్దు నమనుక్కిఙ్గు యాదొన్నుమిల్లై,
కలియుమ్ కెడుమ్ కణ్డు కొణ్మిన్ కడల్వణ్ణన్ పూదఙ్గళ్ మణ్మేల్
మలియప్పుకు న్దిశై పాడియాడి యుళిzతర కణ్డోమ్.

— తిరువాయ్మొళి

దీని భావమే ఈ పద్యమున సంగృహీతము.

ఉ॥ అంబుధి వర్ణదాసు లిల యంతట దిర్గుచు పాడి యాడి స్వే
చ్ఛం బచరింపఁగంటి మిహజీవుల పాపము మాసె బాసె ఘో
రంబగు నారకంబు కలిప్రమాప్పడె నయ్యమధర్మరాజు బా
ఙింబడు వారె లేరిక; సమృద్ధి సమృద్ధి సమృద్ధి కావుతన్.

— శఠకోప గీతామృతము

శ్రీవైష్ణవ సిద్ధాంతమును ఆసేతుశీతాచలము శిష్యులతో పాద యాత్ర చేసి వ్యాప్తి చేసిన భగవద్రామానుజులవారే ఈ నాలాయిరదివ్య ప్రబంధమును బహుళ ప్రచారములోనికి తెచ్చినవారు. వారే తిరువాయ్ మొళికి ప్రథమ వ్యాఖ్యను తమ శిష్యు లొకరిచే వ్రాయించినారను విష యము గూడ మనము మరువదగినది కాదు.

సూర్యుడు ద్వాదశాత్ముడు. కాని ద్వాదశసూరులు మాత్రము దేశ కాలదృష్ట్యా విభిన్నులైనను భగవదేకాత్ము లగుట చిత్రాతిచిత్రము. ఈ దివ్యసూరుల సూక్తిసుమములు భక్తిసూత్ర గ్రథితములై సహృదయ కంఠధారణ యోగ్యమయినవి. దివ్యప్రేమ సురభిళ కల్పతరుప్రసూ నము లివి!

అలౌకిక ప్రతిభాసంపన్నులగు నీ పన్నిద్దరు పరమయోగుల చతు స్సహస్రగాథాత్మక దివ్యప్రబంధమందలి యందలి భగవద్గుణానుభవా మృతమును తనివితీర గ్రోలగలిగినపుడు మాత్రమే మనము చరితార్థు లమై బ్రహ్మానందసాగరమున నోలలాడి పునరావృత్తిరహితమగునమృత ఫల మందుకొనగలము.

కాన దానికై త్రికరణశుద్ధిగా ప్రయత్నింతము 

శ్లో॥ భక్తామృతం విశ్వజనానుమోదనం
సర్వార్థదం శ్రీశఠకోప వాఙ్మయమ్,
సహస్ర శాఖోపనిషత్సమాగమం
నమామ్యహం ద్రావిడ వేదసాగరమ్.

మూడు

# ద్రావిడ వేదావతరణము

ఉ॥ వేదము వేదమే; ద్రవిడవేదము వేదమునుం బ్రబంధమున్
వేదసమూహసారమును వేదశిరోఽర్థ నిరూపకంబు లో
కాదర భాజనంబగు సముంచిత కావ్యము నయ్యె నిట్లుగా
నేది కొఱంత ? యిద్ది పఠియించిన వారికి శ్రీపరాంకుశా !

— శ్రీ పరాంకుశ శతకము

దక్షిణభారతదేశమున తామ్రపర్ణీ నదీతీరమున ఆళ్వార్ తిరునగరిలో శఠకోపమహర్షి యను నమ్మాళ్వారు అవతరించిరి. జన్మప్రభృతి ఐహిక విషయదూరులై వారా నగరములోని ఆదినాథస్వామి సన్నిధిలో ఒక చింతచెట్టుతొఱ్ఱలో ఆసీనులై యోగసాధన చేయసాగిరి. భగవద్ధ్యానమే నిద్రయు, తద్గుణానుభవమే ఆహారమును కాగా చిటికెలో వారికి పదు నారవ వత్సరము వచ్చినది.

క్రమముగా నా యోగిలో పరభక్తి పరజ్ఞాన పరమభక్తులు వృద్ధి చెందసాగెను. దైవదర్శనకాంక్షయే పరభక్తి. తత్సంగమకాంక్షయే పరి జ్ఞానము. సంగమము కల్గిన తర్వాత తనస్వామిని వదల నిచ్ఛగించలేక పోవుటయే పరమభక్తి. చంద్రునికై వీక్షించు చకోరమువలె భగవత్సం యోగమునకై యీ సాధకుడు మిగుల తహతహ జెందసాగెను.

భగవద్విరహ పీడితుడగు నా భక్తవరుని యార్తికి ప్రీతుడై శ్రీహరి గరుడవాహనారూఢుడై నీలమేఘ నిభాకారముతో పీతాంబరము మిగుల శోభిల్లుచుండగా శంఖచక్రాదుల ధరించి, శ్రీభూనీళలు తమ్ము కొలువగా నమ్మాళ్వారులకు ప్రత్యక్షమయ్యెను. వెంటనే శఠకోపు లానంద పారవశ్యముచే నొడలు మరచిపోయిరి. కొంతపడి కెట్టకేలకు తెలివినంది పరబ్రహ్మ సందర్శ నానందముచే కనులనుండి ముక్తాఫలములవలె నానందబాష్పములు కురియగా నిట్లా యోగివరుడు తలపోసెను. "ఆహా! ఏమి నా భాగ్యము. నేటికి స్వామి ప్రత్యక్షమైనాడు. ఏమి యీ వాత్స ల్యము. ఏమి యీ స్వామిత్వము. ఏమి యీ సౌశీల్యము. ఏమి యీ

సౌలభ్యము. ఏమి యీ గాంభీర్యము. సద్గుణముల కన్నిటికి నీతడే యాకరము కదా! అట్టి వానిలో నీ గుణము లుండుటలో నబ్బురమేమి? ఈ స్వామి రూపమాధురిని నా నేత్రాంజలులతో త్రావి ఊత డెచటికిని పారిపోకుండ నా హృదయపంజరమున నిపుడే గట్టిగా కట్టివైచెదను" ఈ రీతిగా నా శ్రీహరి దివ్యమంగళ విగ్రహ కల్యాణగుణ సౌందర్యమును తనివిదీర ననుభవించి అపూర్వవాఙ్మాధురితో నవరసములు జాలువార తమ దేశభాషయగు ద్రావిడమున పలురీతులుగా గానము చేసెను. ఆయన వాణి ద్రావిడవాణికి నవరసార్థభావబంధురాలంకార మయ్యెను. సంగీతసాహిత్యములు స్తనద్వయముగా శోభిల్లగా వాణి యాకవిరసనపై మనోహరలాస్యము చేసెను. మచ్చుకొకటి రెండు ద్రావిడపాశురములను ప్రతిపదార్థ తాత్పర్యములతో నిచట పొందుపరచుచున్నాను.

పా. కూఱాయ్ నీఱాయ్ నిలనాకి క్కొడు వలశురర్ కులమెల్లామ్
శీఱా వెరియుమ్ తిరునేమి వలవా తెయ్వక్కోమానే
శేఱార్ శునైత్తామరై శెన్దీ మలరుం తిరువేంగడత్తానే
ఆఱా వన్బిలడియే పున్నడిశేర్ వణ్ణ మరుళాయే.

— తిరువాయ్ మొళి

ప్రతిపదార్థము: కొడు=క్రూరులైన, వల్=బలిష్ఠులైన, అశురర్=రాక్షసులయొక్క, కులమెల్లామ్=వంశమంతయు, కూఱాయ్=తునకలై, నీరాయ్=భస్మమై, విలనాకి=నేలయై (మన్నై, నిశ్శేషమై) పోవునట్లుగా శీఱా=కోపగించి, ఎరియుం=జ్వలించుచున్న, తిరునేమి=సుదర్శనమును వలవా = దక్షిణహస్తమందు గలవాడా!, తేయ్వామ్ = నిత్యసూరులకు, కోమానే=నాయకుడా, శేరు=బురదచే, ఆర్=నిండిన, శునై=చెలమనీళ్ళ యందలి, తామరై=తామరపువ్వు, ఒప్పిశెమ్=ఎఱ్ఱని, తీ=నిప్పువలె, (కాంతిగలదై), మలరుమ్=వికసించుచున్న, తిరువేఙ్గడత్తానే=వేంకటాచలమునకు స్వామియైనవాడా!, ఆరా=అపరిచ్ఛిన్నమైన, అన్పిల్=నీ విషయమైన స్నేహముతో నున్న (స్నేహముగల), అడియేన్=దాసుడనైన నేను, ఉన్నడి=నీ పాదములను, శేర్వణ్ణమ్=చేరు విధమును, అరుళాయ్=అనుగ్రహింపుమా.

తాత్పర్యము : శత్రుసంహారక మయిన సుదర్శనచక్రము చేత ధరించి తిరుమలయందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ ! నా పాపము లను పోగొట్టి నీ భక్తుడనైన నన్ను నీ పాదములందు ఇపుడే చేర్చు కొనుము. ఇక నీ విరహము సైరింపజాలను.

"వానో మఱికడలో మారుతమో తీయుకమో
కానో వరుంగిత్తు కండిలమాల్ - ఆనీన్ఱ
కన్టుయర త్తామెఱిన్దుకాయు తిర్త్తార్ తాళ్ పణిందోమ్
వన్ తుయరై యావా మరిన్దు."

— పెరియ తిరువందాది

ప్రతిపదార్థము : ఆన్–ఆవు, ఈన్ఱ=కన్నట్టి (అసురావిష్టమైన), కన్టు=దూడను, తామ్=తాము, ఉయర=పైకి. ఎఱిన్దు=విసరికొట్టి, కాయ్ =వెలగకాయను, ఉతిర్న్దార్=పడగొట్టినవానియొక్క, తాళ్=శ్రీపాదములు పణిందోమ్=ఆశ్రయించితిమి, వన్=క్రూరమైన, తుయరై=పాపమును, (మన) మరుంగుం=సమీపమునందు కూడ, కండిలమ్ = కానకున్నాము, ఆర్=కనుక, (అది) వానో = ఆకసమందో, మఱి = అలలు కొట్టుచున్న, కడలో=సముద్రమందో, మారుతమో=గాలియందో, తీయుకమో=అగ్ని యందో, కానో = అడవియందో, ఒరుంగిత్తు = (ఆ పాపము) చేరినది, ఆవా=ఏ మాశ్చర్యము ! (ఈ పాశురమునకు ప్రతిపదార్థ తాత్పర్యములు నాకు తెలిపినవారు మా సోదరి శ్రీ కొండూరి లక్ష్మీనరసమ్మగారు).

తాత్పర్యము : శ్రీకృష్ణుడు వ్రేపల్లెలో పెరుగుతున్నాడని, వాని వలన తనకు మృత్యువు తప్పదనుకొని కంసు డా బాలుని సంహరించుట కనేక మాయలు పన్నెను. ఆ పసివానిని సంహరించి రమ్మని ఒక రాక్ష సుని పంపగా వాడు ధేనుకాసురుడై కృష్ణుని సమీపించెను. మరొక రాక్ష సుడు వెలగచెట్టు రూపము దాల్చి తన కాయలయందు విషము ధరించి దారిలో నుండెను. వాడే కపిత్థాసురుడు. భయంకరమైన కొమ్ములతో తనను పొడుచుటకు వచ్చుచున్న యా ధేనుకాసురుని కృష్ణు డవలీలగా మేకపిల్లవలె నెత్తిపట్టుకొని వెలగచెట్టుకు వేసి కొట్టెను. కాని విచిత్రము. ఆ యసురు లిద్దరు కృష్ణుని దెబ్బతాకిడికి నుగ్గునుగ్గు అయిరి.

అంతే కాదు. ఆ యిద్దరు రాక్షసులు నశించుటతోపాటు మానవుల పాపపటలి సైతము పటాపంచలయ్యెను. వింత యేమన, ఆ పాపము చుట్టుపట్టుల నెక్కడను కాడగట్టలేదు. అది ఆకసమున కెగిరిపోయినదో, సముద్రపు టలలలో పడి కొట్టుకొని పోయినదో, గాలిలో కలసినదో, అగ్నిలో కాలిపోయినదో, లేక అడవిలో కలసిపోయినదో! తర్వాత నా పాపము కనుపింపనే లేదు. ఏమాశ్చర్యము!

పై విధముగా శఠకోపస్వామి శ్రీమన్నారాయణస్వామిని ప్రార్థింపగా నాత డమందానందముతో భక్తవత్సలుడై నందున నిట్లానతిచ్చెను. "సుగుణమణీ! నీవేల జన్మించితివో నీకు తెలియకున్నదా! నన్ను దర్శించుట కుపయోగించు విశిష్టాద్వైత భక్తిదర్శన గ్రంథజాలమును ద్రావిడభాషలో నిర్మింపుము. తర్వాతనే నీవు నా సాయుజ్య మంద గలవు."

శ్రీపతి యిట్లానతిచ్చి యంతర్హితుడు కాగా శఠవైరి యా మురవైరినే సదా మనమున నిలుపుకొని తదీయ కల్యాణగుణ చేష్టితములను వివరించి మోక్షమార్గమును బద్ధజీవులకు కరతలామలకముగా సమగ్రహించు ద్రావిడ సంహితను నిర్మించెను. సంహిత యనగా జీవకోటికి మిగుల నాత్మహితము కల్గించునదని యర్థము. శ్రీ శఠారి వాక్కులు నవరసితములు! దివ్యప్రేమ సౌరభవర్షి సువర్ణచాంపేయ కుసుమములు!! మానవులపాలిటి కైహికాముష్మిక హరములగు పీయూషచషకములు. పాపాత్ముల దురిత లతల కాప్రబంధములు లవిత్ర సదృశములు!!!

వకుళ భూషణుల హృదయాంబుజమున బుట్టిన యా దివ్యప్రేమ సౌరభాంకూరములు స్వామిసందర్శన జనితానంద రసాతిరేకమున నా కవిశేఖరుని జిహ్వాగ్రమునుండి వెలువడుటతోడనే విరాడ్రూపము ధరించి యక్షరపదభావము భజించి ద్రావిడాగమరూపమున విశ్వమంతటిని తమ పరిమళములతో వ్యాపింపచేయసాగెను.

ఇట్లు మన యాళ్వారులు భక్తిపూర్ణులై దక్షిణ భారతదేశమున గల ముప్పదియొక్క తిరుపతులలోని విష్ణుదేవుని యర్చామూర్తులను నుతింపసాగిరి. అట్లే యుత్తరమధురలోని శ్రీకృష్ణునిగూడ పాడిరి. ఆ కవి

యొక్క భగవత్పరితాపైక తీవ్రతకు మెచ్చి తిరుపతి, శ్రీరంగము, కుంభకోణము మొదలగు దివ్యదేశముల యందలి విష్ణువుయొక్క యర్చావతారమూర్తు లాయనవద్దకు తమంత తామేవచ్చి ప్రత్యక్షమైరి. అంతేగాదు, ఆయన కూర్చుండియున్న చింతచెట్టు కొమ్మలను బట్టుకొని నిలబడి 'ఓ భగవత్కవీ! ముందు నాయందు పద్యములు చెప్పి నన్ను ధన్యుని చేయుము. కాదు ముందు నాపై బల్కుము' అని అహమహమి కతో వచ్చి గుంపుగట్టి కోరసాగిరి. చూచితిరా ఈ విచిత్రము!

ఈ విధముగా నా కవిలోకమూర్ధన్యులు తన రసపద్యాగ్రైఖరితో స్వస్థలమును వదలకయే యెదుటకు వచ్చిన యా యా హరిమూర్తు లను పాడిపాడి వారివారి గుణగణములను గానము చేసిచేసి యిహజన్మ మందే భగవత్సందర్శనముచే ధన్యులైరి.

అట్లప్రయత్నముగ లభ్యమయిన శఠకోప కవితామృతమును చెదరిపోకుండ వారి శిష్యుడు మధురకవీంద్రుడు తన లేఖినిచే లిపి బద్ధము చేసి మనమందర మా యమృతము గ్రోలుటకు కారణభూతు డయ్యెను.

నమ్మాళ్వారులు చతుర్వేదసారముగా నాల్గు ప్రబంధములను నిబం ధించిరి. మొదటిదగు ఋగ్వేదసారము 'తిరువిరుత్తము'న 100 పాశుర ములును, యజుర్వేదసారము 'తిరువాశిరియమ్' అను రెండవదానిలో 7 పాశురములును, మూడవది అథర్వణవేదసారము 'పెరియతిరువందాది' యందు 87 పాశురములును గలవు. నాల్గవగ్రంథము చరమప్రబంధము మోక్షప్రబంధమని వినుతికెక్కెను. అదే తిరువాయిమొళి. ఇది ఛాందో గ్యోపనిషద్వివరణమని ప్రసిద్ధము. దీనిలో 1102 పాశురములు గలవు. ఇందు పది శతకములున్నవి. శతకమునకు పత్తు అని వ్యవహారము. ప్రతిపత్తునందును పది దశకములుండును. ఒక్కొక్క దశకమున 10 పాశు రములును, ఫలశ్రుతి ఒక పాశురమునను నుండును. ఈ దశకమునే తిరువాయ్‌మొళి అనిగూడ నందురు. ఒక్కొక్క దశకమునకు 11 పాశు రముల చొప్పున పత్తుకు 110 పాశురము లుండును. ఈ లెక్కను పది

పత్తులకు 1100 పద్యములయినవి గదా! ఒక దశకమున కేశవాది నామములు 12 చెప్పుటచే రెండు పాశురము లెక్కువయయినవి. ఈ విధముగా మొత్తం గ్రంథమునందు 1102 గలవు.

ద్రావిడమున నున్న ఈ తిరువాయ్‌మొళ్ళి గ్రంథనిర్మాణమున నొక సారస్యము కలదు. అదే అంతాదిక్రమము. పద్యము ముగించిన చివరి పదముతో మరల తర్వాతిపద్య మారంభించబడును. దీనిని ముక్తపదగ్రస్త మనవచ్చును. ఈ రీతిగా వేయిపద్యములు గూర్చి యొక వాఙ్మయహారము నిర్మించుట భగవత్కటాక్షలబ్ధ కవితావిభువులకే గాని యితరులకు సాధ్యము కాదు గదా!

తిరువాయ్‌మొళ్ళిలో అర్థపంచకము...స్వస్వరూపము, పరస్వరూపము, పురుషార్థస్వరూపము, ఉపాయస్వరూపము, విరోధిస్వరూపము–అనునవి వివరింపబడినవి. ఆత్మయొక్క స్వరూప స్వభావములు తెలిసికొనుటయే స్వస్వరూపము. పరమాత్మస్వరూపజ్ఞానమే పరస్వరూపము. జీవుడు దేవుని పొందినందున గలుగు ఫలవివరణము పురుషార్థ స్వరూపము. భగవంతునిజేరు మార్గవివరణమే యుపాయ స్వరూపము. దేవుని జేరుట కెదురగు విఘ్నపరంపరల నెరుగుటయే విరోధి స్వరూపము. తిరువాయ్‌మొళ్ళి ముఖ్యముగా ద్వయమంత్రార్థ మనబడు మంత్రరత్నవివరణము. లక్ష్మీసహితుడగు నారాయణుని సేవించినచో మనము సర్వదుఃఖములనుండి నిర్ముక్తులమై విష్ణుసాయుజ్య మందగలమని యిది తెలుపును.

తిరువాయ్‌మొళ్ళి "దీర్ఘ శరణాగతి" నమ్మాళ్వారులు "దీర్ఘ చింతయంతి" అని సంప్రదాయజ్ఞుల ధారణ! అది మఱియొక వ్యాసమునకు విషయము.

## నాలుగు

# మహర్షి కవితామాధురి

శ్లో॥ ఋషిం జుషామహే కృష్ణ తృష్ణాతత్త్వ మివోదితమ్,
సహస్రశాఖాం యోఽద్రాక్షీ ద్ద్రావిడీం బ్రహ్మసంహితామ్॥

మానవుని కానందానుభూతి కల్గించుటకు కళ అవతరించినది. తా ననుభవించిన శోకము శ్లోకముగా వెలువరించి విశ్వశ్రేయోదాయకమగు కావ్యము నిర్మించుట కవిబ్రహ్మ కొక్కనికిమాత్రమే చేతనయిన కార్యము ఈ లోకమును సృష్టించిన బ్రహ్మ వారివారి కర్మల ననుసరించి మానవుల లలాటములపై వారిని సృష్టించునపుడే సుఖదుఃఖములు తీర్చిదిద్దును కాని ఆ వ్రాత వ్రాసిన బ్రహ్మకుగూడ తెలియదు. మరి మనకెట్లు తెలియును? చతుర్ముఖుడగు ఆ బ్రహ్మవలెగాక చతురముఖుడగు కవిబ్రహ్మ చేతనకోటిని దుఃఖదూరులను చేసి రసానందాబ్ధిలో ముంచెత్తును.

అట్టి కవులలో మూర్ధన్యుడు వాల్మీకిమహర్షి. విశ్వసాహిత్యమునకే ఆ మహర్షి ఆదికవి. "కవతే సర్వం జానాతి, సర్వం వర్ణయతి, సర్వం సర్వతో గచ్ఛతి వా కవిః" అని కవిశబ్దమునకు వ్యుత్పత్తి. సర్వమును ఎఱిగి వర్ణింపగలవాడే కవి. "కవిః క్రాంతాదర్శి" త్రికాలవేది మాత్రమే కవిశబ్దవాచ్యుడు. "ఋషయో మంత్రద్రష్టారః" మంత్రద్రష్టలు ఋషులు. "మంతారం త్రాయతే ఇతి మంత్రః" స్మరించిన వారిని కాపాడునదే మంత్రము. కాగా మహర్షులకు, కవులకు ఈషన్మాత్రము భేదములేదు. ఋషులు విశ్వహితైకకాంక్షులు. ఆ హితమును గూడ సహృదయుల హృదయములకు నొప్పి కలుగకుండ సరసముగా నందించుటలో వారు కావ్యశిల్పము నాశ్రయింతురు. కాదు కాదు. శిల్పమే అట్టి మహర్షుల వాక్కులను వలచివచ్చి ఆశ్రయించును.

చరిత్ర తెలయజేయుచున్నంతలో అట్టి మహర్షుల కోవకు చెందినవాడు వాల్మీకి తరువాత శఠకోపమహర్షియే. నిర్హేతుకభగవత్కటాక్షజన్యమగు వీరి వాగ్ధోరణియే తిరువాయ్‌మొழி యను దివ్యద్రావిడ ప్రబం

ధము. దీనిలోని పద్యములను పాశురము లందురు. పాశుర మనగా శ్రావ్యమైన స్వరము అని యర్థము. ఇంపయిన కవిత అని భావము. సాహిత్యపు విలువమాత్రమే గాక చక్కగా పాడుకొనుటకు గూడ వీలుగా రాగ తాళములను వీనికి నాథముని యను మహాకవి నిబంధించెను.

"శ్రియఃపతి యింత చక్కని కవితాసంపద నా కనుగ్రహించి నాడు గదా! దీని నాతని కళ్యాణగుణపరంపరాస్తుతికే తప్ప యితరుల కెట్లుపయోగింపగలను" అని ఆళ్వారులు నిశ్చయించుకొనిరి.

పూర్వాలంకారికులు సాహిత్యమునకు, కావ్యమునకు నే లక్షణములు నిర్వచించినారో అవన్నియు కొరతలేకుండ నీ దివ్యప్రబంధము నెడగూడ నన్వయించును. కాని ఆ గ్రంథము ద్రావిడభాషలో నుండుటచే దాని లోని కవితాగుణములు వివరించుట కిది తావుగాదు. కాన నిందలి ప్రధాన లక్ష్యము మాత్రము నిట వివరింతును.

"విద్యయా ఒమృతమశ్నుతే" అను సూక్తము విద్యకు ప్రధాన లక్ష్యమును బోధించుచున్నది. విద్యచే-అధ్యాత్మవిద్యచే-అమృతము లభింపగలదని దీని యర్థము. అమృత మనగా నిచ్చట మోక్షమని యర్థము. ముముక్షువులకు మోక్షమే గదా అమృతముకంటె గూడ వాంఛ నీయము! జన్మ జరాదుఃఖ మరణనివృత్తియు, భగవత్సందర్శనానంద మును మోక్షపదమున కర్థములు. విద్యకు లక్ష్యములు గూడ నివియే.

ఇట్టి కవితాసంపదను తన కనుగ్రహించిన యా పరాత్పరు నీ కవి యభినందించిన పద్యముల నిట కొన్నిటి నుదాహరింతును.

ఉ. ఓలిగ మెప్పునున్న భువనోత్తము శాసనశీలు, సన్మహీ
పాలు తురంగరాక్షస విభంజను నాపతి సన్నుతించి కెం
గేలు మొగిడ్చి మ్రొక్కి లెసఁగించి మనోహరశబ్ద మాలికా
జాలము నిచ్చికోఁ దగిన సంపదఁ గంటి; నికేమి లోటగున్! 341

నిండుకొలువున్న సర్వజగత్పాలకుడు శ్రీమన్నారాయణుని వినుతించి అంజలిబంధముతో మ్రొక్కి చక్కని వాగ్రూపమాలికల నాతనికి సమర్పింపగల కవితాసంపదకు నోచుకున్నాను గదా! నా కింకేమి లోపము?

ఉ. నీల విశాలనేత్ర రమ నిత్యనివాసముసేయ పేరెదన్
గ్రాలెడు వాని పెద్దయమరాగపుఁ గన్నులవాని దేవతా
పాలకు గాటపుం గయిత పాటలమాటలఁ బూజఁ జేసి యీ
నేలఁ గలట్టి క్లేశసరణిన్ సడలించితి; భాగ్యమెట్టిదో! 342

నీలోత్పలదళాక్షియగు నిందిరాదేవి తన హృన్మందిరమున వెలుగు చుండగా విశాలనేత్రములతో భక్తులను పరిపాలించు ఆ మహావిష్ణువును సాంద్రమధుర కవితాగానమాలలతో కైసేసి యిహలోకమునగల బాధ లన్నిటిని బోగొట్టుకొనగలిగిన నే నెంత భాగ్యశాలినో గదా!

చ. అవిరళనిత్యమోద చరమావధిఁ దేలెడు నచ్యుతున్ గుణా
ర్ణవు నలినాక్షు దివ్యజననాయకునిన్ గలకాలమున్ వచః
ప్రవిమల గానమాలికలఁ బ్రస్తుతిఁ జేసిన భాగ్యశాలినై
యవిరళ నిత్యమోదచరమావధి నేనును నోలలాడితిన్. 343

సాంద్రానంద చరమసీమలో మునిగితేలుచుండు సద్గుణాకారుడగు దేవాధిదేవుని సదా నిర్మల వాగ్రూప గీతమాలికలలో ప్రస్తుతించుచున్న నేను గూడ సాంద్రానంద చరమసీమలో మునిగి తేలియాడితిని.

ఉ. తన్ను ననన్యులై కొలుచు దాసుల దోసము తూలఁ గౌఁగిలిన్
గొన్న పరున్ విహంగతురగున్ సమిదుత్సుక చక్రహస్తు వా
గున్నత గానమాలికల నోపి నుతించిన భోగభాగ్య సం
పన్నుఁడ నాదు నాత్మఁ బరమాత్మ యొనర్చిన దెట్లెరుంగుదున్.
344

సదా తన్నే కొలుచు దాసుల దోషములు నశించునట్లుగా వారిని గట్టిగా కౌగిట గ్రుచ్చియెత్తు గరుడవాహనారూఢుని భక్తోపకారి దుష్టజన శిక్షకై సదా తన సుదర్శనచక్రాయుధమును కేల సిద్ధము గావించుకొని యుండు నా దివ్యస్వరూపుని నోపికతో నుతింపగల్గిన భోగభాగ్యముల కేనాడో పెట్టిపుట్టినాను. కాని నా యాత్మ నా పరమాత్మ యెట్లు సృజిం చెనో తెలిసికొనజాలనైతిని గదా!

మ. మనకున్ బువ్వనఁ గాపురంబుఁ గొను పద్మాదేవి కానంద మి
చ్చును భూమిస్థులకుం దివస్థులకు నీశుండౌను; శీతాబ్జ పీ
ఠ నిష్టాంఘ్రిఖితలున్ జగజ్జనకు జాడల్ చాటు పాటల్ సువా
క్యనిరూఢిన్ రచియించు నాకుఁ బరమాకాశస్థులున్ సాటియే. 348

భర్తలగు మనకును పద్మాలయ యగు నిందిరా సుందరికిని నానందప్రదుడా మహనీయుడు. దేవమానవుల కీశ్వరుడు. జగజ్జనకుడగు నతనిజాడ తెలియజేయు చక్కని పాటలు నిర్మించు నాకే దేవతలు సాటికాగలరు ?

శా. తానే యిప్డు మదాత్మనా నొకఁటియై దైవాఖ నా పల్కులన్
నే నే బల్కిన నవ్యకావ్యమను భంగిన్ వెల్లడిం జేసి స్వీ
యా నూనోక్తులఁ దానె దన్ బొగడు మాయావర్తి మూర్తిత్రయే
శానుం డాద్యుఁడు నాకు మున్ బలుకు నే జాడన్ బదుల్
తీర్చెదన్. 682

ఆ పరమాత్మయే నా యాత్మయైనాడు. నేనే పల్కిన నవ్యకావ్యము వలె దీనిని నా వాగ్రూపమున వెలువరించినాడు. ఈ విధమున నాతడు తన వాక్కుతో తన్నుతానే పొగడుకొనుచున్నాడు. నేను నిమిత్తమాత్రుడను. త్రిమూర్త్యాత్మకుడు మాయామయుడు నగు నాతడు నాకంటె ముందే తన్నుగూర్చి తాను నా జిహ్వతో పలుకుకొనుచుగూడ నాకే యా ఘనత కట్టబెట్టుచున్నాడు. చూడు డా భక్తపారిజాతమునకు నాపై గల యవ్యాజ వాత్సల్యము! నిర్హేతుకజాయమాన కటాక్షము ! ! అట్టి కరుణా సాగరునకు నే నేమి ప్రతి సేయగలను ! ! !

మ. ఇతఁడే మూల మటన్న జ్ఞానమును నా కిప్పించి నా జిహ్వపై
కుతుకం బొప్పఁగ ముందె చొచ్చి రసవద్గాథ ప్రబంధంబుఁ బా
వితులున్ ముఖ్యులునైన భక్తులకుఁ దృప్తిం గూర్ప తన్ దానె కీ
ర్తితుఁడౌ మత్కృతికారకుం; డితనిమూర్తిన్ నేమఱన్ నేర్తునే? 684

ప్రపంచమున కితడే యాది. ఇతడు మాత్ర మనాది యను జ్ఞానము నా కితడే కల్గించినాడు. ఇట్టి పవిత్ర సరస ప్రబంధము భక్తులకు తృప్తి కలిగించుటకై నాచేత లిఖియింపజేసి తానే కీర్తింపబడుచున్నాడు.

నా యీ కృతికి కర్త యీతడే కాని నే నెంతమాత్రమును కాను. అయి నను నే తద్గ్రంథకర్తను నేనే యను కీర్తిని మాత్రము తానే నాకు కట్ట బెట్టినాడు. అట్టి యీతని దివ్యమంగళస్వరూపము నేను మరువగలనా?

ఉ. శీల రమన్ గ్రహించుటకు శిక్షితమున్ సనులక్షణంబు ర
మ్యాలపనంబునై భగవదర్థమునైన కవిత్వభంగికిన్
జాలని జ్ఞానహీను నను స్వప్రతిమాను నొనర్చి నా వచో
జాలము మర్విపైఁ బరచు చంద మొనర్చె; నదెట్టి ప్రీతియో! ౯౮౫

శ్రీమన్నారాయణుని భవ్యశీలసంపద నవగాహన చేసికొనుటకై సుశిక్షితమును, సర్వకావ్యలక్షణసంపన్నమును, రమ్యాలాపయుతమును భగవదేకార్థమును నగు కవితారీతిని సృష్టించుట కే మాత్రమును తగని పరమమూర్ఖుడగు నన్నాతడు తనయంత వానినిగా చేసి నా కావ్యకళను ప్రపంచమున సులభముగ శీఘ్రముగ వ్యాపించు నుపాయము చేసెను. ఆయనకు నాపై నెంత ప్రేమయో గదా!

చ. పరమకవీశ్వరుల్ మధురపాటవ చిత్రకవిత్వచాతురీ
నిరతులు నుండ స్వీయమహనీయ చరిత్రము వారికైత చే
త రచనఁ బొంద కిప్పుడు ముదంబున నన్విడకుండి నాకెనా
పరమపదాధినేత నిజభవ్య కవిత్వముఁ గూర్పఁ గూర్చెడిన్. ౯౮౬

ఆశు మధుర చిత్రశీఘ్రరీతులతో నాస్వారు చతుర్విధ కవితలు నిర్మించుటలో మేటియగు కవీశ్వరు లనేకులుండగా తన మహనీయ చరిత్రము దరికైన వారికవితను చేరనీయకుండ మార్జాలకిశోరన్యాయము ననుసరించి నన్నుమాత్రము వదలిపెట్టకుండ నాచే నా పరమనాథుడు భవ్యకవితా నిర్మాణము చేయించుటకై బద్ధకంకణుడైనాడు. ఆహా! యేమి చిత్రమిది!

శా. వైకుంఠాధి విభుండు నా యఘమునున్ భంగించు శుద్ధుండు నన్
జేకొన్నాడు తనంత వానిగను నాచే స్తుత్యుఁడౌ చుంటనే
వైకుంఠుం డగునట్టు స్వీయవిషయ ప్రాంచత్కవిత్వాప్త శు
ద్ధాకారుం డగునట్టు లెంచె నతనిన్ ధ్యానించినన్ దీరునే? ౯౮౭

"బ్రహ్మ వేదబ్రహ్మైవ భవతి" అను సూక్తము ననుసరించి వైకుంఠనాథుడు నా పాపములు నిర్మూలించి పరిశుద్ధుని చేసి నన్ను స్వీకరించినాడు. తన్ను స్తుతించిన మాత్రముచేత నన్నుగూడ తన యంత వానినిగా చేసినాడు. భ్రమరకీటక న్యాయముచే తనంతవాడ నగునట్లుగా నన్ననుగ్రహించినాడు. నే నెంత తపస్సు చేసినను నింత వాడను కాగల్గి యుండెడివాడనా? ఇపుడు దీని నే విధముగా తీర్చుకొని దయామయుడగు నా దేవుని ఋణమునుండి విముక్తుడను కాగలను!

మ, ఇక మాతెయ్యది వాని సత్కృతికి? లేదే యాత్మనాఁ జిత్తగిం
చి కనంగా నిపు డాత్మయు న్మిగుల కా శ్రీదేవు సొత్తయ్యె; స్వీ
య కృపాబోధక సాధుమంజుల కవిత్వారంభుఁ గావించు సా
మికిఁ జేయన్ బ్రతియొం డొకింతయును భూమి న్నింగినిం
గల్గునే" ౯౯౦

వాని యీ సత్కార్యమునకు బదులేమి గలదు? పోనీ యమూల్య మగు ఆత్మపదార్థము నాది కలదు గదా! దాని నాతనికి సమర్పించిన కొంత ఋణమును తీర్చుకొని నట్లగునేమో! అయ్యో! ఏమిటి నా వెఱ్ఱి! సకల పదార్థములును ఆతనివే యయి యుండగా ఈ నా ఆత్మ మాత్ర మాతనిది కాకుండునా! అన్నిటికంటె గొప్పది యగు మృదుమధుర భగ వత్కవితను నా కనుగ్రహించిన యాతనికి ప్రతిగా సమర్పించుటకు భూమ్యాకాశములలో ఒక్కటియు నాకు కన్పించుటలేదు కదా!

కోమలకాంత పదావళితో నొప్పారు ఇట్టి మృదుమధుర భగవత్క విత మన కనుగ్రహించిన యీ కవి లోకమూర్ధన్యుని ఋణమెట్లు తీర్చు కొనగలము! వారి కవితచేతనే భగవంతుని స్తుతించి మోక్షమార్గాన్వేష కుల మగుటయే మన కనిష్ఠకర్తవ్యము సుడీ!

(ఇం దుదహరించిన పదరత్నములు తుని పట్టణవాసి యనన్య భగవదార్తిపీడితులు కీ. శే. డాక్టర్ నల్లాన్ చక్రవర్తుల వేంకటరాఘవా చార్యులవారి "శ్రీశఠకోప గీతామృతము" లోనిది. దానిలోని అంకెలే ఈ పద్యాల అంకెలు.)

# అయిదవ

## వ త్స ళ భూ ష ణ వా య కి

శా. కామోత్కంఠతఁ గోపికల్ భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠులైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!

— భాగవతము

తీవ్ర భగవత్కామవాంఛతో గోపికలును, భయముతో కంసుడును వైరముతో శిశుపాలాదులును, బంధువులై వృష్ణివంశీయులును, ప్రేమతో పాండవులును, భక్తితో నారదాది మహామునులును భగవంతుని దర్శింప గల్గిరి. తీవ్రధ్యాననిష్ఠులు మాత్రమే దేవుని దర్శింపగలరు.

ఏ రీతిగా భజించినను భగవంతుని చేరసగును. కాని భగవంతుని చేరవలెనను పరితాపము జీవుడు తీవ్రముగ ననుభవించుట మాత్రము మిగుల నవసరము. అట్టి పరితాపము తీవ్రము కానినాడు భగవంతుడు మనకు పట్టుబడడు. అతని జేరుటకు నవవిధ భక్తిమార్గములు కలవు. పోతనార్యుని వాక్కులలో వీని నిట్లు పేర్కొనవచ్చును.

మ. తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!

త్రికరణశుద్ధిగా నీశ్వరునిపై భక్తి నెరపుట, తత్కల్యాణగుణవర్ణన నాకర్ణించుట, దాస్యము చేయుట, నమస్కరించుట, చేతులతో పూజించుట, నేత్రములతో సేవించుట, మనస్సుతో తెలిసికొనుట, వాక్కులతో దివ్యనామ సంకీర్తనము చేయుట, చింతించుట—అనునవే నవవిధభక్తులు.

కాని గోపికలవలె భగవత్కామార్తితో తత్సంగయోగమునకు తహ తహ లాడుటయే పై మార్గము లన్నిటిలో భగవంతుని చేరుటకు సులభో

పాయము. త్రికరణశుద్ధిగా సఖ్యమునెరపుటలో బిడ్డమీదవలెగూడ దేవునిపై వాత్సల్యము నెఱపవచ్చును. ఇట్టి వాత్సల్యభావమునకు రసపరిపాకము కల్పించిన వారిలో పెరియాళ్వారు అనే పేరుగల విష్ణుచిత్తు లగ్రేసరులు. ఆ మహాకవివలె నే సూరదాసుగూడ శ్రీకృష్ణుని తనబిడ్డగా తలచి ఆయన దివ్యమంగళ విగ్రహసౌందర్యమును కల్యాణగుణసంపదను ఎంతో మృదు మధురముగా సూరసాగర మహాకావ్యమున హిందీలో చిత్రించినాడు.

ఆండాళ్ అను నామాంతరముగల గోదాదేవి శ్రీరంగనాథునిపై తన విరహార్తిని వాఙ్మయరూపమున ప్రకటించి చివర కాయననే భర్తగాపొంది ఆయనయందే యైక్యము కాగలిగెను. ఈ కవయిత్రి పద్ధతినే అనుసరించి కృష్ణభక్తాగ్రేసరురాలు మీరాదేవి హిందీలో చక్కని వాణిలో హృదయమునకు హత్తుకొనునట్లుగా సంగీత సాహిత్యముల నేకముచేసి రాళ్లగరుగునట్లు భక్తిగీతములు పాడెను.

కాని నాయికావిరహమును పురుషుడు అనుభవించి దేవుని పాడినట్టి భక్తకవులకు నమ్మాళ్వారులే మార్గదర్శకులు. నమ్మాళ్వారను మాటకు మన యాళ్వారులని యర్థము. భక్తిప్రవాహపూర్ణనది యని భావము. వీరి సూక్తులలోని భక్తిరససమృద్ధి ప్రపంచమునందలి యే భాషాసారస్వతములందును గూడ గోచరింపదనుట యతిశయోక్తి కాదు. వీరి అనన్యభక్తి కబ్బురయ్యె ఆదినాథస్వామి తాను దాల్చిన వకుళమాలికను పొగడపూదండను వీరి కనుగ్రహించెను. ఆ వకుళమాలను భూషణముగా దాల్చినందుననే వీరు వకుళభూషణులైరి.

శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః.

మనస్సే గదా మనుజుల బంధమోక్షములకు కారణము! దైవప్రార్థనకు సుముఖముగ నుండుట కా మనస్సు నీ కవిశిరోమణి యెట్లు మచ్చిక చేసుకొనుచున్నారో తిలకింపుడు –

ఉ. తేనియ పాలు నేయి సుధ తీయనిచక్కెర మేళవించుచున్
పానముఁ జేసినట్లనుభవంబగు నా మధుసూదనుండునున్
నేనునుఁ గూడి కూడి కమనీయరసంబునఁ దేలియాడ నో
మానసమా! శరీరమున మంచితనంబున నీవు నిల్చుటన్. 121

తేనె, పాలు, నేయి, అమృతము అనువానిలో చక్కెర మేళవించి చేసిన పంచామృత మెంత మధురముగా నుండునో అట్లే హరినామ కీర్తనామృత మాధుర్యమువే నే నోడలు మరచియుండుటకు కారణము — మనసా! నీవు నాపై దయ చూపుటయే గదా!

"స్త్రీప్రాయ మితరం జగత్" అను నానుడి భక్తలోకమునకు చిరపరిచితము. భగవంతు డొకడే పురుషుడు. ఇతరులందరు స్త్రీలే. సదా కలసియుండిన వీసుగు తప్పదు. తినగా తినగా గారెలు గూడ చేదగును గదా! కావుననే వియోగానంతర సంయోగమునకు మన యాలంకారికులు విలువ నిచ్చినారు.

నాయిక తన భర్తను వదలియున్నపుడు పడు తాపమును వీరు శ్రియఃపతికై యనుభవించినారు. వకుళభూషణులు నాయికలై విరహ జ్వరార్తితో నెట్లు వెచ్చనూర్చుచున్నారో మనము గూడ అవగాహనము చేసుకొని దాని ననుభవింప ప్రయత్నించుతము గాక! కాని ఆ యోగి మనఃస్థితి నే కొంతయైన నలవరచుకొన్న నే గాని మన కది సాధ్యము కాదు సుమండీ -

తే. అబ్జముఖి యీపె భక్తిచే నాడి యాడి
భావము కరంగ నీ కతల్ పాడి పాడి
కంటఁ దడిఁ బెట్టి నల్దెసల్ కాంచి కాంచి
నారసింహా యటంచుఁ బల్మాఱుఁ బిల్చె. 131

ఆళ్వారునాయకి భక్తిపరవశయై దైవమును ప్రత్యక్షము చేసికొనుటకై విసుగులేక నాట్యమాడినది. హృదయము కరుగున ట్లాతని కథలు పాటలుగా పాడిపాడి యలసిపోయినది. అత డెంతసేపటివరకును రానందున కన్నీ రప్రయత్నముగా జాలువారగా దశదిశలు పరికించి 'ఎందుంటివి నారసింహా!' యని పలుమాఱు పిలిచినది.

తే. లక్కయును మైనమును నగ్నిప్రక్కనున్న
కరణి ఖిన్నమనస్సునఁ గరగె నీమె
కరుణఁ జేయవు రావణాసురపురారి!
యేమిసాధన మింక నేనేమి సేతు?

లక్కయు మైనమును నగ్నిస్పర్శచే కరగిపోవునట్లే యీమెగూడ భగవంతుని తలపగనే-అతని నామము చెవిని పడగనే-ద్రవించిపోవును.

తే. చపలబాలిక యీపె! విశాల లోల
నేత్రములనుండి బొటబొట నీరు కారు
నిహత లంకేశ! యీ యేణనేత్ర కింక
దృష్టిసౌందర్యమును వాడనీయకయ్య, 440

వియోగ తాపతప్తయైన ఈమె కండ్లనుండి దుఃఖాశ్రువు లెడతెగక స్రవించినందున యీ నాయకి నేత్రసౌందర్యము దెబ్బతినునో యేమో గదా! శ్రీరఘురామా! అట్లు జరుగనీయకుమా, నీకు పుణ్యముండును.

మ. కనులం గూరుకు రేఁబవ ల్గనదు కైఁగన్నీళ్ళు జల్లున్ నమ
స్సునఁ గావించును సంకు చక్రమని యేడ్చున్ గుందుగెందామరల్
కనులన్నించును వీడలేనని క్షితిన్ గైనంటు శ్రీరంగ భూ
మిని మీనాంచితనీరసీమ మను స్వామీ! యీమె కేమయ్యెడున్! 611

ఈమె రాత్రింబవళ్ళు నిద్రకు మొగము వాచినది. కన్నీటితోనే చేతులు కడిగికొనుచు విష్ణువు ధరించు శంఖు చక్రములకై పరితపించుచు "కృష్ణా! నిన్ను వీడలే"నని కుందుచుండును. శ్రీరంగనాథా! ఈమె గతి ఏమి కానున్నదో గదా!

సీ. మల్లికాగంధిల మలయ గంధవహంబు
చెలరేగి నను బట్టి చీల్చసాగె
నందమైన 'కురంజి' యనెడు స్త్రీరాగంబు
వినవచ్చె నస్తాద్రిగతుని ఖాను

గానిన సంధ్యాకాలము మ్రమింపఁగ జేసెఁ
నరుణాభ్రరుచిజాల మదలు పెట్టి
ఫుల్లమనోహర పుండరీకాక్షుండు
మనసామి వల్లవజనవృషభుఁడు

సింహగమనుండు మాయుండు చిక్కఁబట్టు
కొని పరీరంభ మొసరించుకొనిన స్తనభు
జములఁ గొంటోయి యొంటిగా సాగి మనము
చేరుకొను తాన మెందేని నేర మకట! 881

మల్లెపూల సువాసనలతో గుబాళించు మలయవాయువు నన్ను పట్టుకొని చీల్చివేయుచున్నది. కురంజి యను రాగము శ్రవణగోచర మగుచున్నది. సూర్యుని మ్రింగిన సాయంసంధ్య నాకు మోహము కల్గించుచున్నది. ఆకాశ మెఱ్ఱబడుట చూచి నా మనస్సుగూడ ప్రియాను రాగరక్తమగుచున్నది. వికసన్నవ పద్మదళాక్షుడును మనపల్లెవీపల్లవు డును నగు మాయుకృష్ణుడు వచ్చి ఊపిరాడకుండ బిగికౌగిట చేర్చిన స్తనములను భుజములను కల్గియుండి కూడ కాంతుడులేని నేనెట్లీ యేకాంతము గడుపుదును? అయ్యో! ఎందు జొత్తును.

సీ. ఉత్తర పవనంబు లుల్లమందునఁ జొచ్చి
విచ్చెడి నే నెంత విగతభాగ్య;
నకట చల్లని యుత్తరాశానిలంబులె
మండెడి గాడ్పులై యుండిసాగె;
నాసింపఁ దగు చల్లనైన జాబిల్లియె
వేడిమిఁ గల చంద్రబింబ మయ్యె!
నతిమృదుకుసుమ శయ్యయె నాకు వేడెక్కె;
మెఱుపుల రెక్కలుగల పుల్గుతేని

తేజిఁ గొను విష్ణుదేవుడన్ తేఁటి తినగ
నాదు స్త్రీత్వసుమంబు జీర్ణత్వ మొందె;
వగ అడంగక నాత్మలోఁ బొగులుకొనియె
సాయమింతయు నామన సీయకుండె. 811

ఉత్తరవాయువు నా గుండెలు చీల్చివేయుచున్నది. అయ్యో! నే నెంత దౌర్భాగ్యురాలను! దక్షిణమారుతము నాపాలిటికి వడగాడ్పయినది. చల్లనివెన్నెలలు గురియు నెలరాజు భగభగ మ్రోగుచున్న యినుప గుండువలె నన్నెట్లు వేపుచున్నాడు గదా! మెత్తని పూలపాన్పు నాకిపుడు వేడి కల్గించుచున్నది. చక్కని రెక్కలుగల గరుడుని వాహనముగా దాల్చిన విష్ణువను తుమ్మెద యనుభవింపగా నా స్త్రీత్వమను పుష్పము జీర్ణమయి పోయినది. నా మనస్సు పూర్తిగా నా వశము తప్పినది. అయ్యో! నే నేమి సేతును?

భర్తయగు శ్రీమన్నారాయణునిలో నైక్యమందుటకు తహతహలాడిన యీ వకుళాభూషణనాయకియొక్క భక్తిరస మెంత సుపరిపుష్టముగా నీ సరస కవితాసంహితలో నిరూపితమైనదో తలచుకొన్న మన యొడలు పులకరింపక మానునా!

(ఉదాహృత పద్యములు శ్రీ శఠకోప గీతామృతము లోనివి.)

# సహస్రగీతి : సందేశము

మ. హరికంటెన్ బరమై శరణ్యమిఁక లేదంచున్ నిరూపింప భూ
భరమున్ మాన్పగ నుత్తరంపు మధురన్ బ్రాపించి తాఁ బుట్టె మీ
సిరి 'కృష్ణార్పణ మస్తు'టంచు గని యుజ్జీవింపు డీ సందియం
బొరయం బోకుఁడి వాని యర్థములె కావో? యన్ని; లేవన్యముల్. 8।0

ఈ ఆళ్వారులు జీవుడు దేవుని చేరుటయే సర్వదుఃఖనివారణోపాయ మని తేల్చి చెప్పినారు. అడుగడుగునకు ఇది మనకు వీరి కావ్యముల ద్వారా సువ్యక్తమగుచునే యుండును.

సామవేద సారమగు చివరిగ్రంథము తిరువాయ్మొళికే వీరి కృతులలో ప్రాముఖ్యము గలదు. మోక్షమార్గము నరచేత నరటిపండొలిచి యిడినట్లు సులభముగా చూపుట గాన దీనికి చరమప్రబంధ మను పేరు ప్రసిద్ధ మయినది.

తే. ఆశ్రమ మహోన్నతానందు నజ్ఞజన వి
వేకదాత స్థిరజ్ఞామరైకనేత
భాసురంబును దుఃఖనివారణమగు
పదమె యాశ్రయ మని పట్టి బ్రతుకు మనస! 1

ఓ మనసా! ఎక్కువ శ్రమపడకుండగనే మహోన్నత బ్రహ్మానంద మిచ్చునట్టి, అజ్ఞానులకు వివేక మిచ్చునట్టి అమరులకుగూడ రక్షకుడైనట్టి సకల దుఃఖనివారకుడునైనట్టి ఆ శ్రీమన్నారాయణుని పదపద్మములనే రక్షకముగా తలచి బహుళ దుఃఖప్రదమగు నీ జీవితము నెట్లెట్లో గడపు కొనుము!

నేను నాది అను భావము మొదలంట పెరికివేసి విశ్వేశ్వరు నాశ్ర యింపుడు. ఆత్మ అన్నిటికిని ఆత్మ కానసే ఆతడు విశ్వాత్ముడు. అతడే మీకు మేలు కలిగింపగలడు.

కం. మీరలు మీ యది యమునది
వేఱు మొదలు నూడఁ బెఱికి విశ్వేశ్వరునిన్
జేరుఁడీ ఆత్మల కంతకు
మీరిన యాధిక్య మేది ? మేలొడఁ గూడ్చన్. 1౽

త్రికరణములను మొదటినుండి స్వాధీనము చేసికొన్నచో నీ స్వామిని తప్పక చేరుకోగలవు.

కం. మనసును; వాకును కాయము
ననఁబడు మూఁడింటి వితము నారపి వీనిన్
మును మున్నే లొంగఁ బఱచి
కొనుమా ! నీ సామిఁ జేరికొనుమా వినతిన్. 20

భక్తుఁడగు వా డనన్యమైన భగవత్ప్రేమను తైలధారవలె నెడతెగక నా విశ్వేశునిపై ప్రవహింప జేయుచునేయుండును. మన కరచరణాద్యవయవములను భగవత్కైంకర్యమను సత్కార్యమునందు గట్టిగా లగ్నము చేయవలెను. ఈ భావము నీ కవి యెంత నిష్కర్షగా చెప్పినారో !

తే. పట్టు విడుపును లేని యా పరమపురుషు
పట్టఁ బాయదు మనసు; తద్భజన మెపుడు
జేయుచుండును జిహ్వక; కాయము నన్
పరవశతను బొంది లేచి నర్తనము సేయు. 54

దీనినే వేర్వేరు కవు లెట్లు చిత్రించినారో చూతము -

కులశేఖరులు -

శ్లో. జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం; చేతో భజ శ్రీధరం;
పాణిద్వంద్వ సమర్చ యాచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు
కృష్ణం లోకయ లోచనద్వయ హరే ర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్.

బమ్మెర పోతన -

చ. హరి భజియించు హస్తములు హస్తము; లచ్యుతుఁ జేరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరెడు చిత్తము చిత్త; మిందిరా
వరుఁ గను దృష్టి దృష్టి; మురవైరి నుతించెడు వాణి వాణి య
క్షరుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో భువిన్.

కాసుల పురుషోత్తమ కవి-

చ. హరి భజియింతునే నహరహంబు హరి స్మృతియింతు భక్తితో,
హరికి సపర్యసేతు హరి కంజలులిత్తు మనోహరంబుగా
హరి సరియైన దేవత యజాండమునన్ నహియంచు నెంచ శ్రీ
హరిపురిఁ జేరవచ్చు మనసా! హరిపాదము లాశ్రయింపుమా.

శ్రీమన్నారాయణస్వామి తన్ను నమ్మి కొల్చిన వారికి సర్వసౌఖ్యములను అనుగ్రహించి ఇక వానిని వదలకుండ కాపాడును సుమండీ.

శా. కన్నందమ్ములనుండి సన్ముదమునం గన్నీరుమం గారు శ్రీ
మన్నారాయణ దివ్యనామ సుధి యేమాత్రంబు విన్పించినన్
మన్నాథుం దరిసించి చేరునెడ ప్రేమం జెప్ప రేయింబవల్
నన్ను న్నన్నఁ జేయు నమ్మి విడఁ డేనాఁ డేమి యాశ్చర్యమో. 98

కం. ఇందు గలఁ డందు లేఁడని
సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు; దానవాగ్రణి వింటే!

అను నీ భాగవతసూక్తికి జోడైన భావన యాళ్వారుల కావ్యమున గని పులకితులు కండు -

మ. కలఁ డెచ్చో హరియన్న పిన్న నుడువుల్ ఖండించి యిచ్చోటమున్
గలడా? యంచుమఁ గంబమున్ విరువ నక్కంబంబునం బుట్టి ని
స్తులరోషాప్తి హిరణ్యుఁ జక్కడఁచెఁ దోడ్తో మానృసింహుండు త
ద్బల మాహాత్మ్యములౌను కాదనుచు వాదా? యెంతహాస్యంబగున్ 179

ఒక యర్భకుని మాట ననుసరించి స్తంభమున నుద్భవించి దుర్గుణాకరుడగు హిరణ్యకశిపుని వధించిన శ్రీలక్ష్మీ నరసింహస్వామి భక్తుల సంకటములు నెందుకు తీర్పడు !

శత్రువులు నవ్వగా బంధువు లేడ్వగా సర్వదుఃఖములు కల్గించు లౌకికవ్యవహారము లిక మేము చేయలేము స్వామీ! నీ పాదారవిందము లను చేర్చునట్టి మృత్యువునే మా కనుగ్రహింపుము.

ఉ. గొంగలు నవ్వ బందుగులు గొల్లున నేడ్వ నచింత్యదుఃఖ మె
ల్లం గలిగించు లౌకికలాపము లేల కృపాళు మాకు; ను
త్తుంగతరంగ సంకలిత తోయధిమంథన! నీ పదంబె చే
ర్పంగల మృత్యువుం గను నుపాయము నా కెఱిగింపు సత్వరన్. 381

భాగవతోత్తములలోనే భగవంతు డుండును, అతని యస్తిత్వము వేరుగా లేదు. అట్టి శ్రీహరి పరస్వరూపులగు భక్తులను కాంచగనే మన పాపములు పటాపంచ లయిపోయినవి. కలి దోషములు హరించినవి. ఇక యముని క్రూరకార్యకలాపములు మూలబడినట్లే. ఎటు చూచినను హరి భక్తిసామ్రాజ్యమే వృద్ధిచెంద గలదు.

ఉ. అంబుధివర్ణుదాసు లిల యంతట దిర్గుచు పాడియాడి స్వే
చ్ఛం బచరింపఁ గంటి మిహజీవుల పాపము మాసె బాసె ఘో
రంబగు నారకంబు కలి క్రమ్మనృడె న య్యమధర్మరాజు బా
ధిం బడు వారె లేరిక; సమృద్ధి సమృద్ధి సమృద్ధి కావుతన్.

"కలౌ స్మరణాన్ముక్తిః" అన్నారు గదా! ఆ రీతిగా కలి దోష ములు నశించుటకు కృతయుగమే ఈ భువిపై కవతరించినట్లు, పరమ పదమునుండి నిత్యసూరు లను పేరుగల భక్తులే ఈ యిలపై కవతరించి నట్లు, సముద్రమువలె పొంగి ముందుకు సాగివచ్చుచున్న శ్రీపతి భక్తులు తమ సామగానముతో ఆ శ్రీహరిని పాడుచు యావత్ప్రపంచమును విప దంబుధి నిమగ్నము కాకుండ కాపాడుదురు గాక. మీరంద రా భాగవ తోత్తముల నాశ్రయించి తరింతురు గాక! యను మహాసందేశము నాళ్వారులు మనకు అనుగ్రహించుచున్నారు.

భార్యాపుత్త్రులు, ఆప్తులు, బంధువులు మొదలగు వారందరును మనవద్ద ధనమున్నంతవరకే యీగలవలె చుట్టును మూగుదురు. ఎట్టి మాయోపాయముల నయినను మనపై ప్రయోగించుటకు వెనుదీయక దానిని మన చేతులనుండి సంగ్రహించి ఎక్కడివా రక్కడికే తొలగి పోదురు. కాన పైజెప్పిన బంధువులు మొదలగువారిపై ప్రేమవదలి దశ దిశలందును వ్యాపించియుండి యన్నింటిని తనయందే లయముచేసి కొను సర్వేశ్వరుని భజించుటతప్ప మీకు వేరుదిక్కేదియు లేదుసుమండీ.

మ. కొనుఁ బెండ్లాములు బిడ్డ లాప్తులునుఁ దక్కుం గల్గు జుట్టాలుఁ గ
న్గొను నల్లప్పుడె కూర్తు; రొండపుడు పొందుల్ జార్తు; రష్టాశలం
దును క్రిందన్ బయిమన్న యన్నిఁ దనయందున్ బొందు
సర్వే శుభ
క్తిని జీవించుట తక్క దిక్కు మరియేదీ? మీకు లేదే సుఁడీ. 801

భార్యలు మనలను రక్షించుటకై వచ్చినట్లు నటింతురు. చేతికే మైన చిక్కు నవకాశము కనుపించిన జలగలవలె పట్టుకొని పీల్చి పిప్పి చేయుటకు గూడ వెనుకాడరు. ఒక్క యమ్ముతో సప్తసాలములను పడ గొట్టిన నీలమేఘ నిభాంగుడగు మన శ్రీకృష్ణునే సర్వరక్షకుడుగా తలచి కొలిచి మనుడు. తక్కిన బంధములన్నియు బూటకములు.

మ. చెలులున్ రక్షకులట్లు పట్టుకొనుచున్ చేఁజిక్కు మేలున్న చో
జలగల్ పోలిక జ్ఞాతి బంధువులు పైసాఁ బీల్తు; రేకాస్త్ర ని
ర్దళితోత్పాటిత సప్తసాలు; మన యుద్ర్భవ్యామునే నేతగా
గొలువన్ బూని మనుండు తక్కినవి బొంకుల్ వ్యర్థసంబంధముల్.
802

తా మేమో పెద్ద వ్యవహారదక్షు లయినట్లును, పురుషులు తెలివి తక్కువదద్దమ్మ లయినట్లును స్త్రీలు తలంతురు. అట్టివారి మోహజాలమున చిక్కుకొని కృత్రిమభోగాదుల ననుభవించువారు తర్వాత ఘోరనరక యాతనలను గూడ ననుభవించక మానరు. కాన క్రూరరాక్షసుల నణచి లోకసంగ్రహము చేసిన శ్రీకృష్ణునే యారాక్షసులను మించిన మీ యరి షడ్వర్గమును చీల్చి చెండాడుమని ప్రార్థించి శరణు వేడుడు. అంతకంటె సుఖమందుటకు మార్గాంతరము లేదు.

మ. తమ కార్యజ్ఞతఁ దామె మెచ్చికొని హింతస్ దేనియల్ జిల్కు వా
క్యములన్ బల్కెడు స్త్రీలతో మధురభోగం బందువా రాద ట
న్యమునుం గందురు; భీకరాసురులఁ జెందన్ బుట్టు శ్రీకృష్ణు దా
స్యముఁ జేపట్టి మనుండు లేదు సుఖ మన్యం బంతకన్నన్ జూఁడీ.
805

మ. కులముల్ నాల్గిటికంటె హీను అవివేకుల్ చండచండాల జా
తులవారైన సుదర్శనాంచిత భుజున్ ద్యోతేంద్రనీలాంగు దా
సుల మంచున్ మది నమ్మిరేని యలదాసుల్ వారిసేవించు దా
సులుసున్ వారల దాసులు న్మనకుఁ బూజ్యుల్ స్వాములున్
నిచ్చలున్. 269

చతుర్వర్ణములకు జెందనివారైన చండాలచండాలురు గూడ హరి పాదసేవ ననిచ్ఛిన్నముగా జేయగల్గియుండినచో అట్టి వారికి దాసాను దాసుల మగుటయే మన కర్తవ్య మను నీ భావమెంత మధురము!

శ్రీహరికంటె రక్షకుడు మరొకడు లేడు. భూభారము మాన్పుటకే అత డవతరించినాడు అని నిరూపించుటకు మీ పుణ్యము పండి ఉత్తర మధురానగరిలో నాత డవతరించినాడు. కాన నికముందు మీ రేపని చేసినను "సర్వం కృష్ణార్పణమస్తు" అని పల్కి ఫలాపేక్ష వదలి శ్రీకృష్ణు నికే దానిని ధారపోయుడు. సందియ మందనేల! ఈ కనుపడున వన్నియు వానికి జెందినవే. ఇతరులకు వీనితో నెంతమాత్రమును సంబంధము లేదు.

(ఉదాహృత పద్యములు శ్రీ శఠకోప గీతామృతము లోనివి.)

ఏడు

# కణ్ణినుణ్ శిఱుత్తామ్బు

## (మధురకవి ఆళ్వారుల రచన)

శ్లో॥ ఆచార్య స్స హరి స్సాక్షాత్ చరరూపీ న సంశయః,
మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యా చ్ఛాస్త్రపాణినా.

మూర్తీభవించి సంచరించు శ్రీమహావిష్ణువే ఆచార్యుడు. అజ్ఞానాంధకారమగ్నమగు జీవకోటికి తన యాచరణ యను పవిత్ర కరావలంబనము ననుగ్రహించి వారికి జ్ఞానోపదేశ మాయన చేయును. శ్రీ మహావిష్ణువే ఆచార్యుడై అవతరించి జీవుల నుద్ధరించును. ఈ చిన్నకావ్యము గురుభక్తి బోధకము. ఇది మిగుల చిన్నదయ్యు మహత్తరము గాన తెలుగున దీని యనువాదము అందింపబడుచున్నది. ద్రవిడమునందు వలె దీనినికూడ సంతాదిక్రమమున పరమమధురముగా రచించిన "సంగీత సాహిత్య కళానిధి" శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారీ సందర్భమున మన కభివందనీయులు.

'కణ్ణినుణ్ శిఱుత్తాంబు' అనగా ముళ్లుగల సన్నని కన్నెత్రాడు అని అర్థము. వేదాంతవాక్యములచే గూడ ననిర్వచనీయుడగు శ్రీకృష్ణుడు తల్లి చేతబట్టుకొన్న చిన్న ముళ్ళత్రాటితోనే కట్టబడెను గదా! అట్లే భక్తులయిన వారెట్టి పరుషవాక్కులతో నుతించినను ఆశ్రితజనరక్షాదీక్షితుడగు నా శ్రీహరి వారియెడ తప్పక ప్రసన్నుడయి తీరుననుటయే దీనిచే ప్రతిపాదింపబడు మహార్థము. కాని యా దేవుడు గూడ సదాచార్యునిద్వారా సమాశ్రయించిననే గాని మనకు సులభుడు కాజాలడని గూడ నిందర్థము గర్భితము. నమ్మాళ్వారుల నాల్గుదివ్యప్రబంధములును వారి యంతేవాసియగు నీ మధురకవి చూడామణి వలననే మనకు లభ్యమయిన వను మాట మరువరానిది సుడీ!

తే. వాంఛఁ జిఱుత్రాటిచేఁ గట్టువడిన పెద్ద
మాయకాఁడగు నా ప్రభు మాటకన్నఁ
గురుక కధ్యక్షుఁడగు శఠకోపు స్మరణ
నాలుక్క నమృతంబు రుచియించు నాల్క కెపుడు. 1

నాల్కనిండారఁ బాడి యానంద మంది
తిని, దదంఘ్ర్యబ్జములు బట్టితిని, దదన్య
దేవు నెఱుఁగను, శఠకోప దివ్యగీత
సరసగానమ్ము సేయుచు దిరుగుచుందు. ౨

తిరిగి దేవాధిదేవు సుందరవినీల
శోభ మీఱెడు నెమ్మేనుఁ జూడఁ గంటి;
నహహా! సముదారుఁడౌ కురుకాధినాథు
దాస్యమున న భాగ్యమిద్ది లబ్ధమ్ము నాకు. ౩

నాదు నైచ్యముఁ జిత్తమునం దలంచి
తల్లియై తండ్రియై కొలంతలను బాపి
ప్రోచు గుణపూర్ణుఁ డామ్నాయములకుఁ జిక్కి
తెల్ల దీసిన శఠవైరియే ప్రభుండు. 4

ప్రభుని సొత్తగు నాత్మ నా వశమటంచు
నమ్మి మున్నంతయుఁ బరాంగనలను గోరి
యుంటి; బంగరుమేడల నొప్పు కురుక
యధిపు సేవ సమర్థుఁడ నైతి నింక. ౫

ఇంక నెక్కాలమును స్థిరవృత్తిఁ దనదు
భవ్యగుణములు వొగడెడి భాగ్యమిడెను
బర్వతోత్తుంగసౌధాళి బరగు కురుక
పతి యిఁకెన్నఁడు నన్ విడువండు కనుఁడు! ౬

కని నను౦ గారితనయుండు కరుణ నా పు
రార్జితోరుతరాఘము లణఁచినాఁడు;
చాటెదను గాక యెల్ల దిశలను దెలియ
ద్రవిడకవినేత శ్రీ శఠారాతి కరుణ. 7

కరుణఁ గొనియాడు దాసనికరము కరము
హృష్టమందఁగ వేదరహస్యములను
ద్రావిడమ్మున వేయిగీతములఁ దెల్పి
నతని కృప యిజ్జగమున నాఢ్యమ్ము చాల. 8

చాల మోక్షార్థులకు వేదసారములను
బాడి నా మనమున స్థిరపరచినాఁడు;
గుణగరిష్ఠుఁడు శఠకోపగురునిఁ బ్రేమ
నాశ్రయించిన దాని కియ్యది ఫలమ్ము. 9

ఫలము లేకున్న విముఖులో వారినైన
చర్యలను దిద్ది సుముఖులఁ జల్పి పికర
వాంఛితా రామయుత కురునాథినాథ!
నీ పదమ్ముల కర్థింతు నేను బ్రీతి. 10

ప్రీతి హరిఁ గొల్చుచుండువారి పయి నెంతొ
వత్సలుం డగు కురుకాధిపతికి దాసుఁ
డై మధురకవి సెప్పిన యర్థములను
నమ్ము వారికి పరమపదమ్ము పదము! 11